# ఒక తెలుగు కథ

## తెలుగు తక్కువ ప్రపంచంలో






Z
WXY
STUV
NOPQR
HIJKLM
ABCDEFG

నందివెలుగు ముక్తేశ్వర రావు విశ్రాంత ఐ.ఎ.ఎస్. అధికారి

# ఒక తెలుగు కథ

తెలుగు తక్కువ ప్రపంచంలో...


ప్రచురణ కాలం : 2020





ప్రతులకు : మండలి ఫౌండేషన్
గాంధీక్షేత్రం, అవనిగడ్డ -53112
కృష్ణ జిల్లా - ఆంధ్రప్రదేశ్

రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో

వెల : **రు. 25/-**

కవర్ ఆర్ట్ : అఖిల్ దేవరకొండ

లే ఔట్, ముద్రణ : అంకుష్ ప్రింటర్స్
నల్లకుంట, హైదరాబాద్-44,
ఫోన్ : 9666699078

# సూచిక

ముందు మాట

# ఒక మంచి పని... ఒక మంచి మాట

ప్రజల అధికారి, బహు భాషావేత్త అయిన నందివెలుగు ముక్తేశ్వర రావు గారు రచించిన “ ఒక తెలుగు కథ ... తెలుగు తక్కువ ప్రపంచంలో..” అనే పుస్తకాన్ని జనం మధ్యకి తీసుకొస్తున్న ఈ తరుణంలో కొన్ని పరిచయ వాక్యాలు రాయడం నాకు చాలా ఆనందంగా ఉంది.

పాలనారంగంలో తెలుగు ఇప్పటికే మిణుకు మిణుకుమంటోంది. ఈమధ్య కాలంలో బోధనా రంగంలో కూడా వస్తున్న మార్పులు చాలా విచారాన్ని, విషాదాన్ని కలిగిస్తున్నాయి.

చదువు అనేది మనిషి వికసించడానికి దోహదం చేసే ప్రక్రియ. ఒక మనిషి మంచి పౌరుడు కావాలంటే నాగరీకుడు కావాలంటే అతనిలో జ్ఞానం, శాస్త్రీయ స్పృహ, సమాజం, సంస్కృతి - అన్నీ కావాలి. కానీ గత 3, 4 దశాబ్దాలుగా చదువుని ఇలా మార్చేసాము.

చదువు మార్కులు ర్యాంకులు సీట్లు ఉద్యోగాలు డబ్బులు ఆస్తులు చదువు వీటికన్నా ముఖ్యమైనది.. ఇంత కన్నా పెద్దది... మంచిది, దేశానికి ఉపయోగపడేది కావాలి. మంచి పౌరుల్ని సృష్టించుకోవడం ద్వారా మంచి దేశాన్ని

నిర్మించడం కావాలి...ఈ మధ్య కాలంలో తెలుగు మధ్యమాన్ని పూర్తిగా ప్రాథమిక స్థాయిలో కూడా తొలగించడం ఆందోళన కలిగించే విషయం.ఆ స్థాయిలో కూడా భాష పోతే మన సంస్కృతి, వారసత్వం, సాంప్రదాయం, సమాజం పట్ల సహజమైన అవగాహన ,ఆసక్తి పోతాయని రచయిత గొంతెత్తి చెప్తున్నారు.

ముక్తేశ్వర రావు గారు ఆయన కలెక్టరుగా పని చేసిన నాటి నల్గొండ జిల్లాలో నూటికి నూరు శాతం పాలనా భాషగా తెలుగుని అమలు చేసి, చక్కటి ఫలితాలు ప్రజా పాలనలో తీసుకువచ్చి ప్రజల కలెక్టరుగా పేరు తెచ్చుకున్నారు. అలాగే ఆ జిల్లాలో ఎన్నో దశాబ్దాలుగా వేధిస్తున్న ఫ్లోరోసిస్ సమస్యకు శాస్త్రీయ పరిష్కారం దిశగా ఆనాడు అడుగులు వేశారు. ఇంగ్లీషు భాష బోధనతో కొత్త శిక్షణా కార్యక్రమాలకు రూపకల్పన చేశారు. ఇంగ్లీషుని ఒక సబ్జెక్ట్ గా ఎంత చక్కగా బోధించవచ్చో ఆ ప్రయోగాలు స్ఫూర్తినిస్తాయి.

ఇంగ్లీషు వద్దే వద్దు అని రచయిత అనడం లేదు. ఇంగ్లీషు నేర్చుకోవడానికి ప్రపంచవ్యాప్తంగా ఎన్నో శాస్త్రీయ పద్ధతులు ఉన్నాయి. వాటిని ఇక్కడ ప్రత్యేక శ్రద్ధతో అమలు చేస్తే పిల్లల్లో ఇంగ్లీషు భాష పట్ల ఆత్మ న్యూనత పోగొట్టొచ్చు. ఇంగ్లీషుని బోధించే పద్ధతులు మార్చుకోవాలి కానీ ఇంగ్లీషు భాషా మధ్యమం మారితే ఇంగ్లీషు వస్తుంది అనుకోవడం సరికాదు. కానీ నేడు జరుగుతున్న ఇంగ్లీషు ప్రహసనం చూస్తే చాలా అశాస్త్రీయంగా, హాస్యాస్పదంగా కనిపిస్తోంది. ఇవే విషయాలను ఎంతో అర్థవంతంగా ఆయన ఈ పుస్తకంలో వివరించారు.

సమాజం లో వేలాది సమస్యలు ఉన్నాయి. అవన్నీ కూడా  పరిష్కారం కావాలని కోరుకుంటాం. కానీ అవి పరిష్కారం కావాలంటే, వాటికి మూలాలు కనుక్కోవాలి. ప్రజల నుండి, వాళ్ళ జీవితల్లోంచి సమస్యలను వాస్తవికంగా చూడగలగాలి. మాతృభాష అనేది అందుకు సరైన సాధనం. మనం ప్రజాస్వామ్యంలో ఉన్నాం. అంటే పాలకులు ప్రజల భాషలో మాట్లాడాలి. ప్రజలు పాలకుల భాషలో మాట్లాడటం ముఖ్యం కాదు. భాష వలన మనుషులు కలుస్తారు. భాష వల్ల మనుషులు ప్రత్యేకతను, విభిన్నమైన స్థానాన్ని సంపాదించుకుంటారు. ఇదే విషయాన్ని ఆయన ఈ పుస్తకంలో ఎంతో

అర్ధవంతంగా, చక్కటి ఉదాహరణలతో వివరించారు. మన జీవితాలు మనకు అర్ధం కావాలంటే మన భాషలో మన మాటలు ఉండాలి అంటారు ఆయన.

ముక్తేశ్వర రావు గారి ఈ పుస్తకాన్ని మండలి ఫౌండేషన్ పక్షాన ప్రచురించడానికి అనుమతించినందుకు కృతజ్ఞతాభివందనాలు తెలుపు కుంటున్నా తెలుగు భాషా వికాసానికి , తెలుగు జాతి ప్రకాశానికి ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభలకు శ్రీకారం చుట్టి జీవితాంతం ' తెలుగు కోసం పరితపించిన స్వర్గీయ మండలి వెంకటకృష్ణారావు గారి స్మృత్యర్థం ఏర్పర్చిన ' మండలి ఫౌండేషన్ ' తెలుగు భాష అస్తిత్వానికి సవాళ్లు ఏర్పడిన సమయంలో ఈ గ్రంధాన్ని తెలుగు జాతికి అందిస్తున్నందుకు గర్విస్తున్నాము.

**మండలి బుద్ధ ప్రసాద్**

అధ్యక్షుడు, మండలి ఫౌండేషన్

గాంధీక్షేత్రం, అవనిగడ్డ -53112

కృష్ణ జిల్లా - ఆంధ్రప్రదేశ్

# ముందు మాట

భాష - ఒక రోజు రాత్రి రాత్రికి భళ్ళున తెల్లవారేటప్పటికి పుట్టుకొచ్చే వస్తువు కాదు.

మనిషి సామాజికంగా జీవించడం ప్రారంభించిన దగ్గర నుండి ఉమ్మడిగా నింగీ నేలని పంచుకున్నట్లు భాషను కూడా పంచుకున్నాడు.

**భాష ప్రజల ఉమ్మడి ఆస్తి.**

వ్యక్తి జీవితంలో రక్తప్రసరణ ఎంత ముఖ్యమో, సమాజ జీవితంలో భాషా ప్రసారం అంత ముఖ్యం. భాష అనేకానేక చారిత్రక సంధ్యల్లో దుర్గమ పర్వతాల్ని దాటుకొని ప్రవాహశీలంగా, సగటు మనిషి హృదయ కేదారాల్ని సస్యశ్యామలం చేస్తూ బ్రతుకుని సతతహరితం చేసే పుణ్యాలప్రోవు.

భాష మన సంస్కృతి, మన జాతి గుండె చప్పుడు.

అప్పుడూ, ఇప్పుడూ ఎల్లప్పుడూ కనబడేదీ, వినపడేదీ భాషే.

మన పిల్లలకు ఉద్యోగాలు అక్కర్లేదా? అని ఒక చిన్న ప్రశ్న వేసి, శాస్త్రీయతకి విరుద్ధంగా తెలుగునాట ఇంగ్లీషు మాధ్యమం దూసుకొస్తున్న

ఈ తరుణంలో మనం ఏం చేయవచ్చో చెప్పడమే ఈ చిన్న పుస్తకం ద్వారా చేసిన ప్రయత్నం. ఈ చర్చ మొదలైన దగ్గర్నుండీ సోషల్ మీడియాలో, ఇతర మీడియాల్లోనూ ఎవరికి వాళ్ళు వాళ్ళకు తోచిన ఇంప్రెషన్స్ చెబుతున్నారు.

ఇప్పుడు మనం ఎదురుచూడాల్సింది మెచ్చుకోలుకోసం కాదు. ఏది శాస్త్రీయం, ఏది తర్కబద్ధం, ఏది జనానికి ప్రయోజనం, ఏది తెలుగు జాతి ఐడెంటిటీని కాపాడుతుంది? మొదలైనవన్నీ మన ముందున్న ప్రదోషకాల సమస్యలు.

ఉపాధి అన్న ఒక్క చిన్న పేరుతో సమస్య మొత్తాన్ని, చర్చించాల్సిన అంశాలన్నింటినీ ప్రాధాన్యత లేకుండా చేసినప్పుడు మహాభారతంలోని తిక్కన రాసిన ఈ క్రింది పద్యం గుర్తుకొస్తుంది.

*"వలలుం డెక్కడ చూచె నొండెడన సేవ్యక్ష్మాజముల్ పుట్టవే*
*ఫలితంబై వరశాఖ లొప్పగ ననల్పప్రీతి సంధించుచున్*
*విలసచ్ఛాయ నుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతి గావింపగా*
*గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపగా నేటికిన్."*

*తి.భార.విరా.అ.2.వ.136*

**భావం:**

మహాసాధ్వి ద్రౌపదికి ఘోర అవమానం జరిగింది. మగటిమి గల భర్త చూస్తూ సహించలేడు కదా! భీముడు నిలువెల్లక్రోధంతో ఊగిపోయాడు. చేతిలో ఏమీ లేదు. ప్రక్కనే విశాలమైన వృక్షాన్ని పెకళింపబోయాడు. ఇదంతా గమనిస్తూనే ఉన్నాడు శాంతగంభీరమూర్తి ధర్మరాజు. వెంటనే భీముని వారించకపోతే కొంప మునిగిపోయే ప్రమాదం ఉంది. అందుకే "ఏమయ్యా వలలా! నీకీచెట్టే దొరికిందా, ఎన్ని చెట్లు లేవు. ఫలపుష్పభరితమై శాఖోపశాఖలుగా విస్తరిల్లి ఇంతమందికి నీడనిస్తున్న దీన్ని వంటకట్టెలకోసం ఖండింపచూస్తావా?" అన్నాడు.

చదువు అనేది ఒక ఫలితం. నేర్చుకోవడం ఒక ప్రక్రియ. నేర్చుకోవడానికీ, చదువరి కావడానికీ కార్యకారణ సంబంధం ఉంది. ప్రతి మనిషికీ, ప్రతి

జాతికీ చదువు అవసరం. భౌతికంగా, మానసికంగా, సాంస్కృతికంగా, ఆధ్యాత్మికంగా, అన్ని రకాలుగా వికసించటానికి చదువు అవసరం.

మనిషి సున్నితంగా ఆలోచించడానికి, నాగరికంగా వ్యవహరించడానికీ, సంస్కారవంతుడుగా రూపుదిద్దుకోవడానికీ, చదువు దోహదం చేస్తుంది. మంచి వ్యవస్థలు, సంస్థలు, నిర్మాణం కావాలంటే మంచి సమాజం మేలైన సమాజం మెరుగైన సమాజం రూపుదిద్దుకోవాలంటే చదువే మూలాధారం.

ఇంత సర్వాంగీణమైన చదువుని 'అన్నమో రామచంద్రా' చదువుగా మార్చడం సరైనది కాదు. దానికోసం బొడ్డూడనివాడికి ఇంగ్లీషు నేర్పిస్తాం అనడమూ సరికాదు.

చదువుకీ మాతృభాషకీ ఉన్న సహజ సంబంధం కొనసాగాలి అని, ప్రజలకు తెలిసిన ప్రజల భాషలోనే ప్రజల చదువు సంధ్యలుండాలని కోరుకుంటున్నాను.

బుద్ధుడు ఒకసారి తన శిష్యుడ్ని ఏదో వెతికి తెమ్మంటాడు. గుహలో, చీకట్లో ఏమీ కనపడక శిష్యుడు వట్టి చేతుల్తో తిరిగి వస్తాడు. రెండవసారి బుద్ధుడు దీపం తీసికెళ్ళి వెతకమంటాడు. శిష్యుడు అలాగే చేసి ఆ వస్తువు తెచ్చిస్తాడు. అప్పుడు బుద్ధుడు ఇలా చెప్తాడు-

"చీకట్లో వస్తువులున్నా కూడా కనపడవు. దీపం వెలుగులో స్పష్టంగా కనబడతాయి".

అలాగే విషయాల్ని శాస్త్రీయంగా ఆలోచిస్తే విజ్ఞాన దీపపు వెలుతుర్లో సత్యం తెలుస్తుంది. దానికోసం చేసిన ఈ చిరు ప్రయత్నమే.....

ఈ గోరంత దీపం...!


నన్ను పక్షిగా, జంతువుగా,
అడవిలో క్రూరమృగంగానైనా
పుట్టించు.. ఏదైనా ఫర్వాలేదు..
నేనున్న నేల తెలుగులో కనీసం
తిట్టుకునే వాళ్ళైనా వుండేట్టు
చూడు తండ్రీ!

# దక్షులెవ్వారలుపేక్ష చేసిన...

భర్తృహరి లోకాన్నిగురించి ఒక మంచి మాట చెప్పాడు.

*‘ బోద్ధారో మత్సరగ్రస్తా:*

*ప్రభవ: స్మయదూషితా: ।*

*అబోధోపహతాశ్చాన్యే*

*జీర్ణ మంగే సుభాషితమ్ ॥”*

భావం:- చదువుకున్న (విద్యావంతులు) వాళ్ళేమో మత్సరగ్రస్థులు, పాలకుల్ని చూద్దామా పొగరుబోతులు. పామరుడికా (జన సామాన్యులకి) తెలుసుకునే శక్తి లేదు. అందువలన సుభాషితము తనలో తానే శిథిలమై పోయింది.

(మంచేమిటో, మంచి మాటేమిటో, జనానికి తెలిసే అవకాశం లేదు)

భారత దేశ చరిత్రలో ఎన్నికల నిర్వహణలో అపురూపమైన కొత్త అధ్యాయాన్ని ఆరంభించిన టి.ఎన్. శేషన్ జీవితంలో జరిగిన ఒక ఘట్టాన్ని మనం తెలుసుకుందాము. టి.ఎన్. శేషన్ కంచి పరమాచార్య చంద్రశేఖర స్వామిని తన గురువుగా, మార్గదర్శకుడుగా భావించేవాడు.

తాను మొదటిసారి ప్రధాన ఎన్నికల కమిషనర్ అయినపుడు తనని అకస్మాత్తుగా కేబినెట్ సెక్రటరీ స్థాయినుండి ప్రధాన ఎన్నికల కమిషనర్‌గా బదిలీ చేశారు. దాన్ని ఆయన వెంటనే జీర్ణించుకోలేకపోయారు. ఆ పోస్టులో తనని "పడేశారు" (షంటెడ్) అని కలత చెందాడు. ఆ సమయంలో కంచి మహాస్వామిని కలసి తన పరిస్థితిని వివరించాడు.

మహాస్వామి చిన్నగా నవ్వి దగ్గరలో ఉన్న 'ఉత్తిర మేరూరు' శివాలయానికి వెళ్ళి 'అక్కడ ఒక శాసనం ఉంటుంది. చదివి' రమ్మన్నాడు. ఆ శాసనంలో **ఎన్నికలు ఎలా నిర్వహించాలి - అంటే - ఎంత పవిత్రంగా రాగద్వేషాలకు అతీతంగా నిర్వహించాలి** అని రాసి ఉన్నది. ఆ శాసనంలో ప్రస్తావించబడిన అంశములు చదివిన శేషన్‌కి మహాస్వామి చెప్పిన మాటలలోని ఆంతర్యం లీలగా బోధపడింది. కర్తవ్యము కళ్ళముందు కనపడింది. పేరుకు మాత్రమే ఉండి మూలన పడి ఉన్న ఎన్నికల ప్రవర్తనా నియమావళిని దుమ్ముదులిపి, బయటకు తీశారు. ధనకావరం, కండకావరాలకు దూరంగా (అతీతంగా) ఎన్నికల నిర్వహణ చేయడం ఎలాగో లోకానికి చూపించాడు.

ప్రస్తుత విషయానికి వస్తే తెలుగు భాష ఒక పెద్ద సంక్షోభంలో పడబోతోంది. దాదాపు కొద్ది రోజుల తరువాత తెలుగు ఇంట్లో బయటా కూడా మాట్లాడాలంటే మాట్లాడొచ్చు లేదా మానేయవచ్చు. భాష అనేది ఒక సాంస్కృతిక ప్రవాహము. మన సమాజం, దాని సాంస్కృతిక మూలాల్ని పట్టి ఎత్తే అంశము. అలాంటి భాష ఇప్పుడు ఒక పెద్ద సుడిగుండంలో పడుతుంటే ఏమి అనకుండా కూర్చున్నారు..... మన తెలుగు రాష్ట్రాల్లోని మఠాధిపతులు, పీఠాధిపతులు.

సంప్రదాయము, సంస్కృతినీ ప్రతిబింబించే మాతృభాష పోయిన తరువాత వాళ్ళ ప్రబోధాలకు అర్థమేముంటుంది.

ఇప్పటికైనా కంచి మహాస్వామిలా ఎవరైనా మాతృభాషా విషయంలో నోరు విప్పితే బావుండు్ను. ఇలా ఉపేక్షిస్తే మనం చూస్తుండగానే మన సంస్కృతి సంప్రదాయము మనకి దూరమవుతాయి.

ఒకప్పుడు ఉదార ఆలోచనా విధానాలకు ఢిల్లీ (J.N.U.) కేంద్రంగా ఉండేది. అందులో ఒక ప్రొఫెసర్ ఉండేవారు. ఆ ప్రొఫెసర్‌కి రెండు మూడు సార్లు పద్మ పురస్కారాలు, అయాచితంగానే (కావాలనే అంటున్నాను) లభించాయి. ఆమె వాటిని నిర్మోహమాటంగా కళ్ళు మూసుకొని తిరస్కరించింది. ఆమెని ఇంటర్వ్యూ చేస్తున్న సందర్భంలో ఇంత పెద్ద పురస్కారాలు లక్షణంగా వచ్చి పడుతుంటే ఎందుకు తిరస్కరిస్తారు? అని అడిగారు. దాని కామె సమాధానంగా -

"అయ్యా! నేను అధ్యాపకురాలిగా ఉన్నాను. పిల్లలకు పాఠాలు చెప్పాను. నేను చేసిన పనిలో గొప్పతనాన్ని, విశిష్టతని చెప్పాల్సింది నా దగ్గర చదువుకున్న విద్యార్థులు. నాతో పని చేసిన సహచర అధ్యాపకులు, నేను రాసిన వాఙ్మయాన్ని చదివినవారు, చర్చించినవాళ్ళు. అంతేగానీ, ఏమీ సంబంధంలేని ప్రభుత్వం ఒట్టి పుణ్యానికి రావడం బిరుదు లిస్తే స్వీకరించడం తప్పు కదా!" అంది.

2003 వ సంవత్సరంలో జమ్మూ యూనివర్శిటీకి వైస్ ఛాన్సలర్‌గా అమితాబ్ మట్టు అనే ఆయన ఉండేవారు. ఆయన అప్పుడు పర్యటనలో ఉన్న (R.S.S.) చీఫ్ కె.ఎస్ సుదర్శన్‌ను తన ఇంటికి బ్రేక్‌ఫాస్ట్ నిమిత్తం పిలిచాడు. ఆ సందర్భంలోనే కాశ్మీరీని ఇక్కడ ఎందుకు వైస్ ఛాన్సలర్‌ని చేశారు అని కొంత మంది మూర్ఖంగా వాదిస్తుంటే అప్పుడు సుదర్శన్ ఇలా చెప్పారు:

"ఇది విశ్వవిద్యాలయం, ఇది అధ్యయన ప్రపంచం. అనేక వైజ్ఞానిక భావాలకి అభయమిచ్చే నిలయం. అందువల్ల అధ్యయన, అధ్యాపనాలకి సంబంధించిన విషయాల్లో రాజీలేదు. రాజకీయాలకు, వ్యాపారాలకు, ప్రమేయం లేదు" - అని కరాఖండిగా చెప్పేశాడు. దాంతో ఆ వివాదం సమసిపోయింది. విద్యాసంస్థలు విద్యావిధానాలగురించి ఆలోచించేటప్పుడు మనం ఎలా వ్యవహరించాలో ఈ సంఘటన తెలియజేస్తుంది.

మన రాగద్వేషాల మీద విద్యావిధానాల రూపకల్పన ఉండకూడదు. అన్నదానికి ఇది ఒక ఉదాహరణ.

**దక్షులెవ్వార లుపేక్ష చేసిరది వారల చేటగు**

దేశానికి మార్గదర్శనం చేయాల్సినవాళ్ళు ఇలా వుండాలి. ఇంత నిర్మొహ మాటంగానూ వుండాలి. అప్పుడు మాత్రమే ఇలాంటి సంధి సమయాల్లో కుండబద్దలు కొట్టినట్లు సత్యాన్ని అకడమీషియన్స్ చెప్పగలుగుతారు.

మన రాష్ట్రంలో దాదాపు 70 బిఎడ్ కళాశాలలు, 70 డైట్లు ఉన్నాయి. ఇవి టీచర్ ఎడ్యుకేషన్ (ఉపాధ్యాయ విద్య)ని బోధిస్తాయి. కనీసం శాస్త్రానికైనా విద్యా విధానంలో మాతృభాషా ప్రాధాన్యాన్ని ఇవేవీ చర్చించటం లేదు. చర్చించవు కూడా. పైన చెప్పిన ప్రొఫెసర్ లాంటివారు మచ్చుకు ఒక్కరైనా లేకపోవడం మన దురదృష్టం. ఇలా జనసామాన్యానికి సంబంధించిన సమస్యలు వచ్చినపుడుపెద్ద పెద్ద సంక్షోభాలు తలెత్తినప్పుడు విద్యాధికులు మౌనంగా ఉండడం సమాజానికి మంచిది కాదు.

# అమ్మ కడుపు చల్లగా ...

ఇక,

జీవితంలో..... సమాజంలో భాషయొక్క స్థానం ఏమిటి అన్న విషయాన్ని చర్చించుకుందాము. దీన్ని చర్చించుకోవడానికి ముందు వందల సంవత్సరాల క్రిందటే 'దండి' అన్న మహాకవి చెప్పిన ఒక మంచి విషయాన్ని ముచ్చటించుకుందాం.

*"ఇదమన్ధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్ ।*
*యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే" ॥*

**భావం:-** శబ్దం (మాట) అనే ప్రకాశము విశ్వవ్యాప్తము కాని ఎడల ముల్లోకములు గాఢాంధకారంతో అలముకొని అలమటిస్తాయి.

ఒక లక్ష సంవత్సరాల క్రిందట జీవించి ఉన్న మేకకు ఈ రోజు మన కళ్ళ ఎదురుగా ఉన్న మేకలో ఎలాంటి మార్పు ఉండదు. అప్పుడు... ఇప్పుడు.... సింహం.... ఏనుగులు మారలేదు. మనిషి నిరంతరం మారిపోతూనే ఉన్నాడు. ఒక వందేళ్ళ కిందటి మనిషికి, నేటి మనిషికీ పోలికే లేదు. ఉదాహరణకి గురజాడ అప్పారావు, కందుకూరిలాంటి వారు చూసిన ప్రపంచం, మనుషులు వంటివి

ఇప్పుడు లేరు. అంటే మానవ ప్రపంచం నిరంతరం మారుతూనే ఉంటుంది. అనుక్షణం మారుతూనే వుంటుంది. దానికి కారణము ఏమిటి? ప్రతి మనిషి తన అభిప్రాయాలని. ఇతరుతో పంచుకోవడం. తెలుసుకోవడం. నేర్చుకోవడం. చేస్తూ ఉంటాడు. దీనికి మూలాధారము..... భాషే.

నా చిన్నప్పుడు ఊళ్లల్లోకి కరెంటు లైన్లు లాగినప్పుడు లక్షలాది కాకులు ఆ తీగల మీద కూర్చుని షాక్ తగిలి మరణించాయి. ఎందుకు అన్ని కాకులు చనిపోయాయి? ఏ కాకీ ఇంకో కాకికి దీన్ని తిరిగి చెప్పటానికి కావలసిన భాష అనే పనిముట్టు లేదు. అదే మనిషికో?

అందువల్లనే భాష ఒక మనిషినుండి ఇంకో మనిషికే కాకుండా ఒక తరంనుండి ఇంకో తరానికి కూడా విజ్ఞానాన్ని, పరిజ్ఞానాన్ని, భావాలను అందచేస్తుంది. ఇలా ఆలోచించినపుడు మన భాష ఇప్పుడు మనకు తెలిసిన కొద్ది మాటలే కాకుండా అనేక కాలాల్లో మనం సముపార్జించిన జ్ఞానాన్ని మొత్తం తన కడుపులో దాచుకొని ఉంటుంది. కాబట్టి భాష మన చారిత్రక, సాంస్కృతిక, వారసత్వ సంపద కూడా. పిల్లలకి మనం ఆస్తులు, అస్థికలు మాత్రమే అప్పగించం. మన భాషా సంపదనీ, సాంస్కృతిక వారసత్వాన్ని అందిస్తాము.

ఉదాహరణకి చలి దేశంలో పుట్టిన ఇంగ్లీషువాడు అతిథికి 'వామ్ వెల్‌కం' చెబితే, తెలుగువాడు "అమ్మ కడుపు చల్లగా" అని దీవిస్తాడు. వీడు ఉష్ణ మండలంలో పుట్టి పెరిగినవాడు కాబట్టి.

పి.వి. నరసింహారావుగారు ప్రధానిగా ఉన్నప్పుడు బెంగుళూరులో "సార్క్" సమావేశం జరిగింది. ఆ సమావేశానికి మనమే ఆతిథ్యం ఇచ్చాం. కాబట్టి ముగింపులో వీడ్కోలు కూడా మనమే చెప్పడం రివాజు. అది చెబుతూ పీవీ గారు "ఎవరైనా వెళ్ళేటప్పుడు నా మాతృభాష తెలుగులో పొమ్మని చెప్పం, పోయి రండి అంటాము. మీరు కూడా పోయి రండి" అని చెబుతూ ముగిస్తున్నాను అన్నారు.

సభలో దేశాధిపతుల కళ్ళ నీళ్ళు చెలమలయినాయి.

ఈ మధ్య కాలంలో ఒక విచిత్ర వాదం చలామణీలోకి వచ్చింది. భాష అనేది ఇతరులతో మనం మన అభిప్రాయాలను చెప్పటానికి ఉపయోగించే పనిముట్టు లాంటిదేనని. దానికి ఇంగ్లీషులో ' వెహికల్ ఆఫ్ కమ్యూనికేషన్, మీన్స్ ఆఫ్ కమ్యూనికేషన్,' Language as a tool లాంటి పదాలు వాడుతున్నారు.

నిజానికి ఇలా వాదించేవాళ్ళకి భాషయొక్క విశ్వరూపం తెలీదు. అది సమాజంలో కలిగించే చైతన్యాన్ని, ప్రబోధాన్ని ఆత్మీయతనీ దేన్నిగురించి తెలీదు. మనుషుల్ని దగ్గర చేసేది, దూరం చేసేది భాషే. ఆత్మీయతల్ని అనుబంధాల్ని పెంచేది భాష, అవగాహన కలిగించేదీ, పెంచేదీ భాష. అనుభూతుల్ని పంచేది భాష. మన సంస్కృతిలోని గొప్ప వెలుగునీడల్ని మనపై పడేట్టు చేసేది భాషే.

ప్రతి మనిషిలో ఒక సమాజం ఉంటుంది. ప్రతి సమాజంలో మనుషులు ఉంటారు. వాటి రెండింటి మధ్యా ప్రవాహ రూపంలో ఉండే ఒక ఆర్ద్రత భాష. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రతి మనిషి ఒక నిద్రించే శిల. సంస్కృతి అనే ఉలితో భాషతో చెక్కబడే శిల్పమే మనిషి.

అందుకే భాష అంటే నీ సంస్కృతి, భాష అంటే నీ ఆకృతి, భాష నీకున్న సమస్తం. భాష నీ మూర్తిమత్వం, భాష నీ వ్యక్తిత్వం. అందువల్లనే ఒక భాష అంతరించిపోతే పైవన్నీ పోయినట్లే - ఒక చరిత్ర, ఒక వ్యక్తిత్వం, ఒక మూర్తిమత్వం మొత్తం పోయినట్లే ఒక్క మాటలో చెప్పాలంటే నువ్వు నువ్వు కాదు. నువ్వు నువ్వు కానప్పుడు ఎవరైనా ఒకటే ... అప్పుడు ఆంధ్రప్రదేశం అనే రాష్ట్రం అక్కర్లేదు. తెలుగనే భారతీయ భాషా అక్కర్లేదు.

బాగా కఠినంగా ఉన్నది కదా నేనంటున్నది! ఇలా అనాల్సిరావడం నా ప్రారబ్ధం కాదు, ఎందుకో తరువాత చాప్టర్లు చదవండి.

ఇంగ్లీషువాడినుండి భారత దేశం స్వతంత్రం పొందిన తర్వాత స్వతంత్ర భారత దేశం ఎలా ఉండాలి అన్నది కలలు కనేవాళ్ళు కొంత మందైతే, స్వతంత్ర భారతాన్ని వాళ్ళ వాళ్ళ అజెండాల ప్రకారం నడిపించాలి అనుకునేవాళ్ళు ఇంకొంత మంది.

మొట్ట మొదటి భాషా ప్రయుక్త రాష్ట్రంగా ఏర్పడిన ఆంధ్ర రాష్ట్రం అనేక రంగాల్లో పురోగతి సాధించింది. **భాషా సంస్కృతుల విషయంలో మాత్రం చావు దెబ్బ** తిన్నది. అత్యంత ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే స్పష్టమైన భాషా విధానము అవిభక్త ఆంధ్రప్రదేశ్‌లోను, విభక్త వామన ఆంధ్రప్రదేశ్‌లోనూ లేదు. సాంస్కృతిక విధానం కూడా లేదు.

మధ్యలో అడపా దడపా కమిటీలు వేయడం, ఎవరో ఏదో వండి వార్చితే ఊ అన్న వారేకానీ నడుం బిగించి పని చేసినవారు లేరు. నేడు సాంస్కృతిక శాఖలు, దాని మూలాలు, మూల్యాలు తెలియనివాళ్ళ చేతుల్లో పడి నలిగి పోతున్నాయి.

ఏదో మనకి తెలిసినవాళ్ళకు నాలుగు సాంస్కృతిక కార్యక్రమాలు ఒప్పజెప్పడం, ఆహా ఓహో అనడం తప్పించి కూచిపూడితో సహా కళా రంగాలన్నీ కుదేలయ్యాయి. మహాసంగీత విద్వాంసులు నూకల చిన సత్యనారాయణగారికి "పద్మ పురస్కారం" వచ్చినపుడు కొంత మంది మీడియావాళ్ళు ఈ నూకల చిన సత్యనారాయణ ఎవరు అని నన్నడిగారు. ఒక పది పదిహేను మంది తప్పించి ఇప్పటి వరకూ రాష్ట్రాన్ని పాలించిన నాయకులకు, I.A.S. లతో సహా ఇతర అధికార వర్గానికి భాషా, కళా సాహిత్య సాంస్కృతిక రంగాలలో కనీస ప్రవేశం, స్పృహ లేవు. అపేక్ష సంగతి దేవుడెరుగు.

ఇదంతా ఎందుకు చర్చించవలసి వచ్చిందంటే ఒక సమాజం మీద భాషా, సాహిత్య, సాంస్కృతిక రంగాలు ఏమి ప్రభావం కలిగిస్తాయి అన్నది తెలియని వాళ్ళ చేతుల్లో భాషా ప్రయుక్త రాష్ట్రాలు నడవడం మన దౌర్భాగ్యం. దీనికి తోడు ఒక భాషావిధానము - సాంస్కృతిక విధానం లేకపోవడం వల్ల ఎప్పుడు, ఎవరు, ఏది కావాలంటే అది చేయవచ్చుననే పరిస్థితి దాపురించింది. విధానం అంటూ లేకపోయినా తరువాత Knowledge is power కాదు. Power is Knowledge అయ్యింది.

మహాకవి షెల్లీ మహాశయుడు ఒక గొప్ప మాట అంటాడు

*"Poets are unacknowledged legislators of the World".*

"మహాకవులు మనం గుర్తించని మన శాసన కర్తలు (భాగ్య విధాతలు)" అని దీనిభావము. మనల్ని మనం ఎలా పరిపాలించుకోవాలి? మన పిల్లలు ఎలా చదువుకుంటే సహజంగా ఎదుగుతారు? ఏ చదువువల్ల పిల్లవాడిలో ఉత్సాహం, వికాసం సహజంగా సుందరంగా ఉంటుంది? ఏ మాధ్యమం వల్ల చదువు చెప్పేవాడికీ, నేర్చుకునేవాడికీ మధ్య అంతరాలు అంతరించి పోతాయి. పాఠం చెప్పడం అనేది యాంత్రిక ప్రక్రియ కాకుండా ఉల్లాస సుందరంగా మారుతుంది? ... ఇవన్నీ ఆలోచిస్తే ఏది మాధ్యమం కావచ్చో, ఏది మాధ్యమం కాకూడదో తెలుస్తుంది. రాష్ట్రం ఏర్పడి 60 ఏళ్ళ అనంతరం కూడా భాషా సాంస్కృతిక విషయంలో కనీస విధాన రూపకల్పన చేయనివాళ్ళనుండి ఏం ఆశించగలం?

పాలనా రంగానికి వస్తే పాలనా వ్యవహారాలు ఏ భాషలో నడవాలి? అన్నది తెలుసుకోవడానికే ఒకటిన్నర దశాబ్దాలు గడిపేశాము. ఆ తరువాత అధికార భాషా చట్టాన్ని తీసుకొచ్చాం. దానికి నియమావళి రూపొందించడం, యంత్రాంగాన్ని ఏర్పరచటానికి మళ్ళీ చాలా కాలం తీసుకున్నాం. ప్రజలు-భాష-పాలన గురించి తెలిసిన ముగ్గురు నలుగురు మహానుభావులు చైర్మన్లుగా వచ్చినపుడు పాలనా రంగంలో కొంత మార్పు వచ్చి భాషకి ప్రజలకి కొంత మేలు జరిగింది. మిగతాదంతా కాలహరణమే! అధికార భాషా సంఘం (అ.భా.సం.) బలంగా నిర్మించటానికి కావలసిన వనరులూ లేవు రాజకీయపరమైన స్ఫూర్తి, వెన్నుదన్ను లేదు. చట్టానికి కోరలూ లేవు. అందువల్ల చాలా సందర్భాలలో హెూదా కోసమో, ఫాయిదా కోసమో వెంపర్లాట ఉన్నవాళ్ళకి ఇది ఉపయోగపడుతూ వచ్చింది. ప్రజాక్షేమానికి ఉపయోగపడని రాజకీయ పునరావాస కేంద్రాల్లో అదీ ఒకటి.

పాలనా భాషగా తెలుగు దూరం కావడం వలన పాలన అనే ప్రక్రియ సమాజంలో (శిష్ట) ఉన్నత వర్గాలకే పరిమితమవుతోంది. సభలు సమావేశాలు, మినిట్స్ ఉత్తర ప్రత్యుత్తరాలు, జి.ఓ.లు, బిజినెస్ రూల్స్ అన్నీ ఇంగ్లీషుమయమే. ఉదాహరణకి ఒక చిన్న పల్లెటూరులో రామయ్య అనే రైతు కిచ్చే ఒక చిన్న సహాయాన్ని మొదలుకొని అర్భక సంక్షేమం, కూలీల సంక్షేమం, అన్ని ఇంగ్లీషులోనే తిరిగి తిరిగి వచ్చే ఊకదంపుడు పడికట్టు పదాలు తప్పించి రాని అధికార యంత్రాంగం, అన్ని కార్యాలయ ఉత్తర్వులనీ ఇంగ్లీషులోనే జారీ చేస్తున్నారు.

మొత్తం మీద తన సమాధినుండి మెకాలే మహాశయుడు విరగబడి నవ్వేటట్టు పాలనా, బోధనా రంగంలో పరిస్థితుల్ని తెచ్చిపెట్టాము. మహర్షులకి వారసులుగా ఉండాల్సిన మనం మెకాలేకి వారసులుగా మారాము. లేనిపోని తద్దినం అంటే ఇదే! ఇదీ భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రగతి బాట.

మాతృభాష మాధ్యమముగురించి ఆలోచించినపుడు యునెస్కో మొదలుకొని 2019 వ సంవత్సరం వరకు వచ్చిన అన్ని నివేదికలు ప్రపంచ వ్యాప్తంగా మాతృభాషలోనే విద్యాబోధన ఉండడం శాస్త్రీయ, ఆనందకరం అని పేర్కొన్నాయి. ఉదాహరణకి 'న్యూ ఎడ్యుకేషన్ పాలసీ' మాతృభాషని గురించి ఇలా పేర్కొన్నది.

1. మాతృభాషలో మాత్రమే పిల్లలు అతి తొందరగా అతి పెద్ద విషయాలు కూడా (సులభంగా) నేర్చుకోగలుగుతారు.

2. వాళ్ళకు అర్థం కాని భాషలో చదువు చెప్తే పిల్లలు మొదట్లోనే నేర్చుకొనే శక్తిని వారు ముందుగానే కోల్పోయి చదువులో వెనుకబడతారు.

3. ఇంకో విశేషమేమంటే ఇప్పుడు రాసే పాఠ్యపుస్తకాలు స్థానిక భాషలో ఇంగ్లీషుకు దీటుగా రాసుకోవాలి. స్థానిక భాషలు అంటే గిరిజన ప్రాంతాలలోని గిరిజన భాషలను కూడా స్థానిక భాషలుగానే పరిగణించాలి.

4. స్థానిక మాతృభాషలోనే కనీసము 5 వ తరగతి లేదంటే 8 వ తరగతి వరకు కొనసాగించాలి.

ఇంత స్పష్టంగా 'నూతన విద్యావిధానం' వివరించి చెప్తున్నా మనం పెడచెవిన పెడుతున్నాం.

మన దేశం మన భాషలనుగురించి (NEP) (నూతన విద్యా విధానం) ఇలా అద్భుతంగా పేర్కొన్నది.

**"తార్కికంగా ఆలోచిస్తే ఇంగ్లీషుకి ఇతర భాషలకన్నా గొప్పగా ఉన్న ప్రత్యేక అవకాశం ఏమీ లేదు. వాస్తవానికి భారతీయ భాషలు శతాబ్దాలపాటు తరతరాలుగా భారతీయ సంస్కృతి వాతావరణాల మధ్య ఒదుగుతూ ఎదిగాయి.**

**భారతీయ భాషలన్నీ శాస్త్రీయమైన నిర్మితతో సంక్లిష్టం కాని ఉచ్చారణలతో చక్కని వ్యాకరణాలతో రూపొందాయి. మనకు ప్రాచీన కాలాల, మధ్య యుగాల, ఆధునిక కాలం నాటి సాహితీ సంపద ఉంది. వాటన్నింటిలో ఇది మనది అన్న భావన ఉన్నది.**

**అందువల్ల ఇంగ్లీషు కేదో ప్రత్యేకంగా ఉన్న సౌకర్యం కానీ, భారతీయ భాషలకు ఉన్న వైకల్యంగానీ లేదు.**

'మాతృభాషలోనే నేర్చుకోవాలి' అని యునెస్కో, మనస్తత్వ శాస్త్రవేత్తలు అందరూ చెప్తున్నారు కదా! దీని వెనకాల ఉన్న శాస్త్రీయత, సత్యం ఏమిటో తెలుసుకుందాము.

**పొత్తిళ్లలో ఒత్తిగిలి పడుకున్న నాటి నుంచే....**

మనం తల్లి గర్భందాటి భూమి మీదపడిన దగ్గరనుండి మనకి అనేకానేక ధ్వనులు వినపడుతుంటాయి. కొంత కాలంపాటు అవి కేవలం ధ్వనులు మాత్రమే (Mere sounds only) కొంత కాలం అయిన తరువాత ధ్వనులకు శబ్దాలకు తేడాని పిల్లలు గుర్తిస్తారు. ఉదాహరణకి ఒక పళ్ళెం కింద పడటం, ఫ్యాను తిరగటం, తలుపు వేయటం ఇవన్నీ ధ్వనులు. మొదట్లో పిల్లలని ఉద్దేశించి పిల్లలతో మాట్లాడేటప్పుడు మన మాటలు కూడా ధ్వనులుగానే వినిపిస్తాయి. రాను రాను ఒక నిర్దిష్టమైన విధానంలో, అమ్మ, అత్త, ఆడ, తాత, లాల పోసుకోవడం, బువ్వ తినటం లాంటి పదాలు భాషగా పరిచయం అవుతాయి. తనకు వచ్చిన కొన్ని పదాలని తిరిగి తిరిగి పలుకుతూ రకరకాల స్పందనల్ని శిశువు అలవాటు చేసుకుంటాడు.

పాకడం మాని నడవడం మొదలైన దగ్గరనుండి నెమ్మదిగా తను కొత్త పదాలు, కొత్త వస్తువులు, కొత్త విషయాలు తెలుసుకుంటాడు. వాటి విశేషాలు కూడా తెలుసుకుంటాడు. అంటే రంగులు, చల్లగా, వెచ్చగా, నున్నగా, తీయగా వంటి పదాలు నేర్చుకుంటాడు. నెమ్మది నెమ్మదిగా తన చుట్టూ ఉన్న ప్రపంచాన్ని తన పదాల ప్రపంచంతో సరిపోల్చుకుంటాడు. ఉదా: చెట్టు ఎత్తుగా ఉంది. మజ్జిగ పల్చగా ఉన్నాయి. అన్నం కారంగా ఉంది వంటివి. ఈ దశలో పదాలు అనుభవాల్ని వ్యక్తం చేస్తాయి.

తను మాటల్లో చెప్పలేని అనుభూతుల్ని పాటలుగా చిట్టి పొట్టి కవితలుగా నేర్చుకుంటాడు. ఆటలు, పాటలు, అన్నీ తన మాతృభాషలోనే నేర్చుకుంటాడు. తను ఒక కథ నేర్చుకొంటే ఆ కథని ఇతరులకి చెప్పేటప్పుడు పెంచి, తగ్గించి అనేక రకాల ప్రయత్నాలు చేస్తాడు. ఇందులో అతని కల్పన, ఊహాశక్తి, చమత్కారము పెరుగుతాయి.

**ఎంత కష్టం...ఎంత దు:ఖం...**

ఇప్పుడు రాబోయే మాతృభాషేతర ఇంగ్లీషు మీడియం బడిలోకి మారిన మరుక్షణం, మనవికాని, మాటలు మనం నేర్చుకోవాల్సి వస్తుంది.

**ఇంటి దగ్గర ఒక భాష, వీధిలో మరో భాష, బడిలో ఇంకో భాష. వీటన్నింటి మధ్య బాల్యం చచ్చి ఊరుకుంటుంది.**

పిల్లవాడిలో పసితనం మాయమౌతుంది. బడి అనే గానుగలో పిల్లవాడు ఒక చెరుకుముక్క.

దీనిని తిరగేస్తే మాతృభాషలోనే నేర్చుకుంటే, మాస్టారు చెప్పే ఎత్తు, ఒడ్డు, పొడవు, చల్లని, వెచ్చని, ఏది మంచి ఆహారం, ఆరోగ్యంగా ఉండాలంటే ఏం చేయాలి, ఏ కాయలో, ఏ పండులో ఏముంది వంటి వన్నీ తాను సంతోషంగా నేర్చుకొని, ఇంట్లో అమ్మ నాన్నలకి అనుభూతి చెందుతూ చెప్తాడు. పిల్లవాడి బాల్యం, పిల్లవాడితోనే ఉంటుంది. వాడు తెలీని ప్రశ్నలు అడిగి తెలుసుకో గలుగుతాడు. వాడికీ ఉపాధ్యాయుడికీ మధ్య అంతరాలుండవు.

కాబట్టి ఎవరెన్ని చెప్పినా ప్రాథమిక విద్య నూటికి నూరు శాతం మాతృభాషలో ఉండటమే శాస్త్రీయము, శ్రేయస్కరము. శ్రేయస్కరము ఎవరికి అన్న ప్రశ్న కూడా ఉదయించవచ్చు. శ్రేయస్కరం పిల్లలకి. ఎందుకంటే ఒత్తిడికి గురికాకుండా సహజంగా విషయాన్ని నేర్చుకోవచ్చు. బట్టీ పట్టాల్సిన అవసరం లేదు. కృతకంగా మాట్లాడాల్సిన అవసరం కూడా లేదు. ఆత్మ న్యూనతకు గురికావాల్సిన అవసరం లేదు. ఇవన్నీ జరగాలి అంటే మాతృభాషలో కనీసం ప్రాథమిక స్థాయి విద్యా బోధన అవసరము. (నేర్చుకోవడం, నేర్పడం తప్పనిసరి).

# కరిక్యులమా? - గురుకులమా?

**కరిక్యులం-గురుకులం:**

మన విద్యా విధానంలో చాలా కాలంగా విద్యా బోధన కరిక్యులం ఆధారంగా జరుగుతుంది. గురుకులం పద్ధతిలో విద్య పుట్టి పెరిగిన దేశంలో కరిక్యులం పద్ధతిలో విద్యా బోధన జరగడం ఒక పెద్ద విషాదం. గురుకులం పద్ధతిలో నేర్పే గురువు, నేర్చుకునే శిష్యుడు, నేర్చుకునే విద్య ఒక ప్రవాహ రూపంలో కలసి కదులుతుంది. శిష్యుని యోగ క్షేమాలు వాళ్ళ వాళ్ళ స్థాయిని బట్టి తరచి చూసుకొని వాడి కిష్టమైన పద్ధతిలోనే విద్యాబోధన జరుగుతుంది. గురువు శిష్యుడు కలిసి సంప్రదించుకొని కాల ప్రణాళిక (Time Table) తయారుచేసుకొని నేర్చుకోవడం మొదలెడతారు.

*అందుకే....*

*సహ నావవతు సహ నౌ భునక్తు సహ వీర్యం కరవావహై*

*తేజస్వి నావధీత మస్తు మా విద్విషావహై*

- అనేది ఉపనిషత్తు వాక్యం. అంటే “గురుశిష్యు లిద్దరూ కలసి బ్రతుకుదాం. కలసి ఉందాం. కలసి తిందాం. కలసి జ్ఞానాన్ని తెలుసుకుందాం. పంచుకుందాం” అని దీని అర్థం. గురుకులాలకు అర్థం ఇది.

ఈ మధ్య కొన్ని (IIT) లాంటి సుప్రసిద్ధ (అత్యున్నత సాంకేతిక విద్యా సంస్థల్లో) ఇప్పటికీ ఈ పద్ధతి పాటించబడుతోంది. విద్యార్థులు ఆచార్యులు కలిసి ప్రణాళిక రూపొందించుకొని ఆ ప్రకారంగా తరగతుల నిర్వహణ ఉంటుంది. మన పాఠశాల స్థాయి విద్యా సంస్థల్లో ప్రణాళిక రూపొందించే విషయంలో విద్యార్థులకు సంబంధం లేకుండా పోయింది. అందువల్ల అధ్యాపకులే రూపొందించిన ప్రణాళికలో పిల్లలు నిమిత్త మాత్రంగా అనాసక్తితో పాల్గొంటారు. నేను సిలబస్ పూర్తి చేశాను అనే ఉపాధ్యాయుడ్ని తరచూ చూస్తూ ఉంటాము. దాని అర్థం ఏమిటి అంటే సిలబస్ పూర్తి చేయడం అనేది ఏకపక్షంగా జరిగే ప్రక్రియగా కనపడుతోంది.

టీచరు కేవలం బోధనకే పరిమితమైన వ్యక్తిగా భావించుకుంటాడు. అప్పుడు నేర్చుకోవడం అనేటువంటి ప్రధాన లక్ష్యం ప్రక్కకు పోయి పాఠం చెప్పడం అనే యాంత్రిక ప్రక్రియ మాత్రమే మిగులుతుంది. అందువలన ఇప్పుడున్న విద్యావిధానం 'కరిక్యులం డ్రివెన్' అని పేర్కొనడం జరిగింది.

**తరగతి గది :**

దీని స్థానంలో పాత సంప్రదాయ పద్ధతుల్లో బోధించే ప్రక్రియ ప్రధానమా?

చాలా కాలంగా చర్చించబడుతున్న అంశ మేమిటంటే బోధన ప్రధానమా? నేర్చుకొనడం ప్రధానమా అన్నది విద్యా రంగంలో ముందడుగులో ఉన్న అన్ని దేశాల్లో ఒక విషయాన్ని అంగీకరిస్తున్నారు. పాటిస్తున్నారు కూడా! అదేమంటే నేర్చుకోవడం అనే ప్రధాన ప్రక్రియలో బోధన అనేది ఒక పరికరం మాత్రమే.

*విద్యార్థి ఉత్సాహంగా ఉండటం.*

*తన స్పందనలని ధైర్యంగా చెప్పడం.*

*ఉపాధ్యాయుడితో కావాల్సినంత చనువు పొందడం.*

ఇవన్నీ ఉంటేనే తరగతి గది దేదీప్యమానంగా ఉంటుంది. కాబట్టి ఈ చర్చలో మనకి తేలేది తరగతి గది సంతోషంగా ఉత్సాహంగా ఉండాలంటే నేర్చుకోవడం, నేర్చుకునే పిల్లలు ప్రధానం కావాలి. ఆ తరువాతే ఉపాధ్యాయులు ప్రధానం కావాలి. అలా ఉండాలి అంటే 'టీచర్-స్టూడెంట్' మధ్య పరభాష అంతరాలు తొలగిపోవాలి.

**పోటీ ప్రపంచంలో ఆంగ్ల విద్య :**

ప్రపంచం మారుతోంది, ప్రపంచమే ఒక మార్కెట్‌గా మారిపోయింది. ముఖ్యంగా ప్రపంచీకరణ తరువాత అన్ని దేశాలలోకి అన్ని వస్తువులు వచ్చిపడుతున్నాయి. ఎవరు ఎక్కువ అమ్ముకోగలిగితే వాడు తెలివిగలవాడుగా పరిగణించబడుతున్నాడు. ఈ సిద్ధాంతం అనుగుణంగానే అన్ని దేశాలు వారి వారి విధి విధానాలను మార్చుకుంటున్నాయి. ఇలా ప్రపంచం అంతా ఒక మూలకి వచ్చేసింది. అందువల్ల దేశాలు జాతులను కలిపేందుకు అనుసంధాన భాషగా ఇంగ్లీషు నిలదొక్కుకుంది. 1940 ల్లో వలస రాజ్యాలు పోయి, జాతీయ రాజ్యాలు అవతరించే సమయం నాటికి ఎక్కువ భూభాగం బ్రిటీషువారి వలస పాలనలోనే ఉంది. అందువల్ల ఆ తరువాత వచ్చిన జాతీయ రాజ్యాల్లో ముఖ్యంగా 'కామన్వెల్త్ దేశాల్లో' ఇంగ్లీష్ నిలదొక్కుకోగలిగింది. దొరలకి, దొరతనానికీ ప్రతీకగా ఇంగ్లీషు నిలబడటం **కామెడీతో కూడిన** ట్రాజడీ. దేశ భాషలు ప్రజల అవసరాలు, ప్రజల పాలనా అవసరాలు, బోధనా అవసరాలు దృష్టిలోకి తీసుకొని దేశ భాష విధాన రూపకల్పన జరగకపోవడం, స్వతంత్రానంతర నాయకులు చేసిన పాప కర్మము.

పైన చెప్పిన చర్చ సారాంశం ఏమిటంటే వలస రాజ్యాల్లో ఇంగ్లీషువాడు పెట్టి పోయిన ఇంగ్లీషు మరింత బలంగా నిలదొక్కుకుని మార్కెట్ శక్తుల ఆలనాపాలనలో నెత్తికెక్కి కూర్చుంది. అందువల్ల ఆధునిక కాలంలో ఇంగ్లీషు అవసరం ఉన్నది-అనడంలో ఎవరూ సంశయించాల్సిన పని లేదు. ఇక్కడే మహాత్మా గాంధీ చెప్పిన మాట గుర్తుకొస్తుంది.

"I am not anti-English, I am not anti-British, I am not anti-any government. But, I am anti-untruth, anti-humbug and anti-Injustice."

- *MAHATHMA GANDHI*

**ఇంగ్లీషు చేర్చుకొనాల్సిన అవసరం ఉంది అనడంలో వెనక్కి తగ్గాల్సిన అవసరం లేదు. ఐతే మనం నేర్చుకోవాల్సిన ఇంగ్లీషు ఎంత నేర్చుకోవాలి, ఎలా నేర్చుకోవాలి అన్నదాంట్లో ఒక్కరికి కూడా స్పష్టత లేదు.** ఉదాహరణకి ఆ మధ్య కాలంలో కొన్ని సంస్థలు ఇంగ్లీషు వాడకం గురించి సర్వే చేపట్టాయి.

ఆ సర్వే ప్రకారం 500 లోపు పదాలు వచ్చినవారు, 1000 లోపు పదాలు వచ్చిన వాళ్ళు, 1500 లోపు పదాలు వచ్చినవాళ్ళు, ఆపైన వచ్చినవాళ్ళు అని విభజించారు. చాలా మంది 500 లోపు పదాలు వచ్చిన కేటగిరీలోనే ఉండిపోయారు. అంటే దీన్నిబట్టి ఒక 1500 పదాలు మనకి తెలిసి ఉంటే చాలా విషయాల్లో మనం ఇంగ్లీషు ద్వారా జయించి రావచ్చు.

ఈకాస్త భాగ్యానికే మనం తల్లకిందులై పిల్లల్ని తల్లకిందులు చేయడం అవసరమా?

**చదువు–సత్యనారాయణ వ్రత కథ :**

అసలు ఇంగ్లీషు నేర్చుకోవడంగురించే చర్చించుకుందాం! ఇంగ్లీషు నేర్పేదెవరు? ఇంగ్లీషు ఉపాధ్యాయుడు. ఇంగ్లీషు ఉపాధ్యాయుడికి ఉండవలసిన నైపుణ్యాలేమిటి?

1. Comprehension (చక్కగా అర్థం చేసుకోవడం).
2. Communication/ Expression (దానిని చక్కగా వ్యక్తీకరించే నేర్పు).

దీని మీద కూలంకషంగా చర్చిస్తే ఈ రెండు విషయాల్లో 90% ఇంగ్లీషు మీడియం పాఠశాలలు కూడా పరీక్షకి నిలబడలేవు. ఒక అన్‌సీన్ పాసేజ్‌ని చదవడం దాని సెంట్రల్‌థీమ్ గ్రహించడం, దానిని కుదించడం, సరైన టైటిల్ పెట్టడం, ఒకే పదాన్ని అనేక రకాలుగా ఉపయోగించగలగడం, వివిధ రకాల నెరేషన్ స్కిల్స్‌ని వాడగలగడం ఇవన్నీ వచ్చా అని ప్రశ్నిస్తే ఔను అని బదులు రాగలిగితే మనం పరీక్షకి నిలబడినట్లే. చాలా మంది ఆంగ్ల ఉపాధ్యాయులు ఇంగ్లీషు పాఠాన్ని 'సత్యనారాయణ వ్రతం' కథలాగా అనువాద విధానంలో బోధిస్తారు. దానివల్ల పిల్లవాడికి పెరిగే నైపుణ్యాలు కానీ పెద్దగా ఒరిగేది కానీ ఏమీ లేదు. వాడి కాంప్రహెన్షన్‌లో, ఎక్స్‌ప్రెషన్‌లో మార్పు రాదు. ఇంగ్లీషు భాషా సామర్థ్యాల్లో వాడి శక్తియుక్తులు ఏమీ పెద్దగా పెరగవు.

అందువల్ల మన బళ్ళల్లో చదువుకుంటున్న పిల్లలు ఇంగ్లీషు భాషా సామర్థ్యం లేకపోవడానికి కారణం బడిలో ఉన్న ఇంగ్లీషు శాఖదే. ఇప్పుడు

బాగుచేయాల్సింది ఇంగ్లీషు శాఖ అనే ఇంగ్లీషు డిపార్టుమెంట్‌ని. ఈ క్రింది అంశాల్లో మెరుగు పరచడం ద్వారా మంచి ఫలితాలు సాధించవచ్చు.

1. వ్యక్తిగత భాషాసామర్థ్యాలు, వ్యక్తి గత భాషా అవగాహన సామర్థ్యము.
2. వ్యక్తిగత భావ వ్యక్తీకరణ సామర్థ్యము.
3. అభ్యసన ప్రక్రియల పట్ల అవగాహన పెంపొందించడం.

ఇంగ్లీషు డిపార్టుమెంట్ ఇది తక్షణం చేపట్టకపోతే శక్తిమంతం కాదు. పరిస్థితి మరింత దిగజారి నానాటికీ తీసికట్టుగా మారే ప్రమాదం ఉంది. అందువల్ల తక్షణం చేపట్టాల్సిన చర్య ఇంగ్లీషు డిపార్టుమెంట్‌ని బాగుచేసుకోవడం.

**రోగం ఒకటి – మందు మరొకటి :**

**సమస్య స్వరూప స్వభావాలు ఇంగ్లీషు డిపార్టుమెంట్ సామర్థ్యానికి సంబంధించినదైనప్పుడు పరిష్కారం ఇంగ్లీషు మీడియంలోకి మార్చాలనటం తార్కికంగా తప్పు. అశాస్త్రీయం కూడా. పడిన చోట వెతుక్కోవడానికి నిరాకరించే మనస్తత్వం అందులో కనబడుతుంది. కొత్త భాష నేర్చుకోవడానికి అదే భాషని బోధనా మాధ్యమంగా చేసుకోవడం సరైన పద్ధతి ఎలా అవుతుందో ఎవరికీ తెలీదు.** వాస్తవానికి పిల్లలకి సామాజిక శాస్త్రాలు, భౌతికశాస్త్రాలు, జీవశాస్త్రాలు మొదలైనవి ఒక చక్కని ధారలో మాతృభాషలో చెప్పగలిగితే చకచకా అల్లుకుపోయే పిల్లలు, లక్షలాది మంది ఉన్నారు. పిల్లలంటే ప్రాణం పెట్టే ఉపాధ్యాయులూ ఉన్నారు.

భాషామాధ్యమాన్నిగురించి ఇంకొన్ని విషయాలు ప్రస్తావించుకుందాం.

ఉదాహరణకి మన శరీరంలో కాలేయం ఏం పనిచేస్తుంది? గుండె ఎలా కొట్టుకుంటుంది? వర్షాలు వర్ష ఋతువులోనే ఎందుకొస్తాయి? రకరకాల ఆకృతుల్లో ఉన్న వస్తువుల పరిమాణాన్ని ఎలా లెక్కగట్టాలి? వంటి అంశాలు ఏ భాషలో నేర్చుకున్నాం అన్నది ముఖ్యం కాదు. విద్యార్థులకు ఆ విషయం పట్ల క్షుణ్ణమైన అవగాహన వచ్చిందా? లేదా? అన్నదే ముఖ్యం.

వీటిని వ్యక్తం చేయాల్సిన అవసరం అధ్యాపక రంగంలో తప్పితే వ్యక్తీకరణ అవసరం పెద్దగా ఉండదు. ఒకవేళ వ్యక్తీకరించాలి అనుకుంటే కూడా అద్భుతమైన ఇంగ్లీషేమీ అక్కర్లేదు. ఇస్రోలో పనిచేసే శాస్త్రవేత్తలు, వివిధ సాయుధ దళాలకు సంబంధించిన అధిపతులు. ఆ మాటకొస్తే అఖిల భారత సర్వీసుల నుండి వచ్చే అధికారులు చాలా మంది మాతృభాషల్లో చదువుకుని అద్భుతాలు సాధించినవాళ్ళే. చాలా చిన్న మాటలతో చక్కని సరళమైన ఇంగ్లీషులో మాట్లాడిన తొలితరం IAS అధికారులు ఎం.ఆర్. పాయ్, శంకరన్‌లాంటి మహానుభావుల్ని చూశాం.

**మొత్తంగా నేను చెప్పదల్చుకుంది ఏమంటే...మనకి ఇంగ్లీషు రావాలి అంటే మనల్ని మనం స్పష్టంగా, సరళంగా వ్యక్తీకరించుకొనేందుకు సరిపడా ఇంగ్లీషు వస్తే చాలు. అలాంటి ఇంగ్లీషు రావాలంటే మనం మన ఇంగ్లీషు డిపార్టుమెంట్‌లని సరిచేయాలి. అంతేగాని ఇతరేతర పరిష్కారాలు ఒక్కొక్కప్పుడు జబ్బు కన్నా మందే ప్రమాదం లాంటి పరిస్థితికి దారి తీయవచ్చు.**

# విద్యలో వెనుకడుగు-వెనుకబాటుకు ముందడుగు

**అర్థం చేసుకోవడంలో దారిద్ర్యం:**

రెండు తెలుగు రాష్ట్రాల్లో కూడా విద్యా సంస్థల విషయంలో గత మూడు దశాబ్దాల్లో పెను మార్పులు చోటు చేసుకున్నాయి. చిన్న చిన్న పల్లెటూళ్ళలో కూడా ఇంగ్లీషు మీడియం పేరుతో కాన్వెంట్లు అనబడే ఇంగ్లీషు మీడియం స్కూళ్ళు ఆరంభమయ్యాయి. A for Ant, B for Bat, C for Cat లాంటి చిట్టి పొట్టి ఇంగ్లీషుకే మురిసిపోతున్నారు తల్లిదండ్రులు. ఇప్పుడే ఇంత ఇంగ్లీషు మాట్లాడుతున్నారు. పిల్లలు పెరిగి పెద్ద అయితే, ఇంకెంత మాట్లాడతారో అని లెక్కలు కట్టుకుంటున్నారు. కొనసాగుతున్న ఈ దృశ్యం ఒక్క క్షణంలో లేదా ఒక్క రోజులో వచ్చింది కాదు. ప్రభుత్వ పాఠశాలల్లో విద్యా బోధన గత నాల్గు దశాబ్దాలుగా ఏడు నిలువుల లోతుల్లోకి దిగిపోవడం ఆరంభించింది. **పాఠశాలల్లో శాస్త్రీయమైన బోధన, ప్రమాణాలు పాతాళం వైపు ప్రయాణిస్తున్నాయి. ఈ మాట చాలా కఠినంగా ఉంది కదా! ఈ మాట అన్నది నేను కాదు. చాలా సందర్భాల్లో ప్రపంచ స్థాయి, జాతీయ స్థాయి సర్వే సంస్థలు ముక్తకంఠంతో ఏకకంఠంతో ఇదే అంశాన్ని చెప్పాయి.**

ప్రమాణాలు పడిపోతున్నాయి అని ఘోష పెట్టాయి. 2018 వ సంవత్సరానికి సంబంధించిన ASER (Rural Report) ఏం చెప్పింది అంటే 5 వ తరగతి చదువుకునే పిల్లలు 3 వ తరగతి వాచకాన్ని కూడా చదవలేక పోతున్నారు. 50% మంది పిల్లల పరిస్థితి ఇదే. దీనికి ప్రామాణికంగా వాళ్ళు తీసుకొనే తూనిక రాళ్ళు ఏమిటంటే లెర్నింగ్ ఔట్‌కమ్స్. ఏ తరగతి స్థాయి పిల్లలకు ఆ తరగతి స్థాయికి సరిపడా ఉన్నాయా? లేవా? అన్నది చూస్తారు. అలా చూసినప్పుడు చాలా మంది పై తరగతికి వెళ్ళిన తరువాత కూడా దిగువ తరగతుల్లోని వాచకాలను మంచి ఆత్మ విశ్వాసంతో చక్కగా చదవలేక పోతున్నారని దీని అర్థం.

ఈ ప్రమాణం దేన్ని సూచిస్తుంది అంటే 50% మంది పిల్లలు అంటే ప్రతి ఇద్దరిలో ఒక్కరికి కనీసం చదివే పరిజ్ఞానం లేకపోతే వారు ముందు ముందు పై తరగతుల్లో ఎలా చదువుకుంటారు. వాడికి అవగాహన నైపుణ్యాలు ఎలా పెరుగుతాయి. పిల్లవాడు భౌతికంగా ఒక తరగతిలో, అవగాహన స్థాయి పరంగా ఇంకొక తరగతిలో, ఆత్మ విశ్వాసం పరంగా ఇంకో తరగతిలో ఉంటారు. ఇలా విద్యా వ్యవస్థలో ప్రమాణాలు చితికిపోవడంతో ప్రజలు ప్రత్యామ్నాయాలు ముఖ్యంగా లెర్నింగ్ ఔట్‌కమ్స్ విషయంలో వెతుక్కోవడం మొదలు పెట్టారు. నూటికి 99% మంది ప్రభుత్వ ఉపాధ్యాయులు కూడా ఇదే బాటపట్టారు.

ఈ పరిస్థితిని ప్రైవేటు పాఠశాలలు అవకాశంగా మార్చుకుని కోట్లు గడించడం ప్రారంభించాయి.

పిల్లలకి చదువురాని ఈ దుస్థితిని 'లెర్నింగ్ పావర్టీ' (నేర్చుకోవడంలో దారిద్ర్యంగా) పేర్కొంటున్నారు. అందువల్ల ప్రభుత్వ విద్యా సంస్థల్లో ప్రమాణాలు కుదేలవటం వల్ల ప్రైవేటు విద్యాలయాల బాట పట్టాము అన్నది సత్యము.

ఇసుకలో తలదాచుకునే ఉష్ట్రపక్షి లోకాన్ని చూడలేనట్లు, గత నలభై యేళ్ళుగా విద్యాశాఖ ఈ సత్యాన్ని చూడటానికి నిరాకరిస్తోంది. దేశంలో నేర్చుకోవడంలోని దారిద్ర్యాన్ని సరిచేయకుండా ఆర్థిక దారిద్ర్యాన్ని పోగొట్టడం అసంభవం.

**కొంచెం ఇష్టం-కొంచెం కష్టం:**

ప్రాథమిక పాఠశాలల్లో నేర్చుకునే చదువును 'చదువుకు పునాది' అంటారు. రాబోయే రోజుల్లో విద్యార్థి జ్ఞానపరిధి విస్తరించటానికి ఆధారంగా ఇప్పుడు నేర్చుకునే నైపుణ్యాలు ఉపయోగపడతాయి. అందువలన దీన్ని 'చదువుకు పునాది' అంటారు.చదువుకు పునాదిలో చదవడం, వ్రాయడం, లెక్కించటం మొదలైన అంశాలతోపాటు ఆటలు, పాటలు చిత్రలేఖనం, పాటలు అల్లడం, కవితలు వ్రాయడం లాంటి లక్ష పనులు చేయగలిగే సామర్థ్యం శక్తి ఆ వయసు పిల్లలకు ఉంటుంది. ఇదే దశలో విద్యార్థి మెల్లగా బడి అనే వ్యవస్థకి కొంత ఇష్టంగా, కొంత కష్టంగా అలవాటుపడుతుటారు. ఈ దశలో పిల్లలతో బడికి మానసికమైన, ఉద్వేగపరమైన బంధం సహజంగా ఏర్పడాలి. అంటే అవి మాతృభాషలోనే ఉండాలి.

కొద్ది నెలల క్రిందట కస్తూరి రంగన్ అధ్యక్షతన వచ్చిన 'న్యూ ఎడ్యుకేషనల్ పాలసీ' ఇదే సత్యాన్ని చాలా విస్పష్టంగా చెప్పింది. పునాది దశలో బడితో అనుబంధం తెగిపోతే అది ఆ పిల్లవాడి జీవితాంతం ఆ ప్రభావం ఉంటుంది. అందుకనే అన్ని దేశాల్లో మాతృభాషలోనే బోధన జరుగుతుంది. చైనా, జపాన్, జర్మనీ, ఫ్రాన్స్‌లాంటి ఆర్థిక పారిశ్రామిక దిగ్గజాలు కూడా మాతృభాషలోనే బోధనకు ప్రథమ ప్రాధాన్యత నిస్తున్నాయి. తల్లి భాషలోనే చదువు నేర్పుతున్నాయి. చైనా, జపాన్‌లు అయితే అత్యున్నత చదువులవరకు మాతృభాషనే కొనసాగిస్తున్నారు. ఇంజనీరింగ్‌లో మహోన్నతమైన కట్టడాలు, డాక్టర్లుగా అద్భుతమైన చికిత్సా విధానాలు, శాస్త్రవేత్తలుగా నూతన పరికల్పనలు, ఆవిష్కరణలు, అధ్యాపకులుగా నూతన బోధనా ప్రక్రియలులాంటి అన్ని రంగాల్లో 'సై అంటే సై'గా నిలబడగలిగే చాలా దేశాల్లో మాతృభాషే మాధ్యమం.

సాధారణంగా మనం నేర్చుకునే ప్రక్రియని మనస్తత్వశాస్త్ర రీత్యా 'తెలుసుకోవడం' (Cognitive ability) అంటాము. ఈ కాగ్నిటివ్ ఎబిలిటీ మనకి తెలిసిన మాటల్లో చదువుకోవడం, వినడం ద్వారా తెలుసుకొనే ప్రక్రియ సులభమౌతుంది. మనకి తెలిసిన మాటల్లో అంటే మనింట్లో మన చుట్టుప్రక్కల, మన ఊళ్ళో మాట్లాడే మాటలు మనం విని విని ఉండటం వల్ల ఆ మాట వినడము, దాని అనుభూతి ప్రకంపనము సహజంగా జరిగిపోతుంది.

ఉదాహరణకి “ఒక అడవిలో ఒక పులి ఉండేది” అనే వాక్యంలో ఒక అడవి, ఒక పులి వెంటనే మన కళ్ళ ముందు రూపుకడతాయి. మావాడు పులిరా! అన్న వాక్యంలో ఉన్న గొప్ప ఫీల్ కూడా మనకు వెంటనే అర్థమవుతుంది.

అందువల్ల కాగ్నిషన్ లెవెల్లో తన చుట్టూ ఉన్న సహజ సిద్ధంగా పరిచయమైన మాతృభాషలోనే చదువు చెప్పమన్నారు. నూతన విద్యా విధానంలో (NEP) మాతృభాషతోపాటు పర్యాయపదంగా లోకల్ లాంగ్వేజ్ అన్న పదం కూడా వాడారు. లోకల్ లాంగ్వేజి కింద గిరిజనులు అధికంగా నివసించే ప్రాంతంలో గిరిజన భాషలు. ఒకే భాషలో వివిధ మాండలికాలు వీటన్నింటినీ విధిగా దృష్టిలో పెట్టుకోవాలని NEP కోరింది. ఈ అంశాల్లో వేటినీ మనం పరిగణనలోకి తీసుకోలేదు. కనీసం వాటిని ఒక్కసారైనా చదివినట్లు కూడా కనపడదు.

విద్యా బోధన పునాది స్థాయిలో పరభాషల్లో ఉండరాదు. మాతృభాషలోనే ఉండాలి అని చెప్పిన సంస్థల్లో

1) యునెస్కో (UNESCO),

2) వివిధ విద్యా సంస్కరణల కమిటీలు,

3) జె.బి. కృపలాని, ఎం.సి చాగ్లా, మౌలానా అబుల్ కలాం ఆజాద్, పి.వి. నరసింహారావులాంటి విద్యావేత్తలు. ఈ దేశాన్ని గురించి కలలుగన్న మహాత్మా గాంధీ, ఠాగూర్‌లాంటి జాతీయ నాయకులు.... వీరంతా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

# జనహితానికే విద్య

"విద్య ఎందుకోసం?" అన్న విషయంలో అనేక మంది అనేక రకాలుగా స్పందించారు. దాంట్లో విద్యావేత్తలు, తత్వవేత్తలు, నాయకులు అందరూ ఉన్నారు. దాదాపు ప్రజాశ్రేయస్సుకి అత్యంత కీలకమైన మూలధనం ఏదైనా ఉంది అంటే విద్య మాత్రమే. వ్యక్తిగా ఎదగాలన్నా, వ్యవస్థలు బాగుండాలన్నా ఆ దేశంలో పిల్లలు ఏం చదువుకొని, ఏం నేర్చుకొని పైకొచ్చారన్నది ప్రధానమైన అంశము.

ఒక కుటుంబం ఆరోగ్యంగా ఉండాలంటే సరైన పౌష్టికాహారం, ఆరోగ్యకరమైన అలవాట్లు, సరిపడా వ్యాయామము వంటివన్నీ కావాలి. ఇవన్నీ విద్యా ద్వారా చిన్నప్పుడే పిల్లలు నేర్చుకుంటారు. ప్రపంచంలో అనేక వ్యవస్థలు గుడులు, బడులు పరిశ్రమలు అన్నీ సవ్యంగా నడవాలి అంటే సమాజంలో వాటి స్థానం ఏమిటి? వాటిపట్ల మనం ఎలా వ్యవహరించాలి? వాటిని ఎలా కాపాడుకోవాలి? మొదలైనవన్నీ సామాజిక శాస్త్రాలు చెబుతాయి.

మనం ఇవాళ జీవిస్తున్న జీవితాల్లో వెలుగులు నింపిన మహానుభావులు ఎవరు? వాళ్ళ త్యాగాల గాథ లేమిటి? మన చుట్టూ ఉన్న ప్రపంచంలో పేద వాళ్ళు అభాగ్యులు ఎందుకున్నారు? కష్టజీవులు ఇంకా ఎందుకు కష్టాల్లో కూరుకుపోతున్నారు? మొదలైన అంశాలు పాఠశాల స్థాయిలోనే పిల్లలు నేర్చుకోవాలి.

చరిత్ర మన కందించిన మైలురాళ్ళు ఏమిటి? మానవ జాతి వికాసం కోసం మహనీయులు వారి తను, ధన, మాన, ప్రాణాల్ని ఎలా ధారపోశారు? మన చరిత్రలో గర్వించాల్సిన అంశాలు ఏమిటి? మన సంస్కృతి మనకి ఏ సంస్కారాన్ని ప్రబోధిస్తోంది మొదలైన అంశాలు చరిత్ర, సంస్కృతి నేర్పుతాయి.

అంతిమంగా ఒక పరిపూర్ణ మానవుడు - ఆత్మ ఉన్నతికోసం సమాజహితంకోసం శ్రమించే మానవుడు -

లోక కళ్యాణంకోసం నేనున్నానని వెంట నడిచే మానవుడు నిర్మించే విద్యా వ్యవస్థ కోసం ఇంతమందీ ఇంత కాలంగా కృషి చేస్తుంటే ఈ ప్రపంచీకరణ పుణ్యామా అని ఉద్యోగం, ఉపాధి కోసమే చదువులు అనే నినాదంతో వ్యవస్థలు నడిపేవారు ముందుకు రావటం, చాలా దురదృష్టం. ఏ దేశపౌరులైనా నిర్మించబడేది పాఠశాలల్లోనే కాబట్టి నాణ్యమైన పాఠశాల విద్య నాణ్యమైన పౌరుల్ని నిర్మిస్తుంది. ఏ దేశంలో విద్యా విధానం పిల్లల్లో సున్నితత్వాన్ని కాపాడుతుందో, ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని కలిగిస్తుందో సృజనాత్మకంగా ఆలోచించటానికి, కలలు కనడానికి, ధైర్యమిస్తుందో అది అసలైన చదువు.

ఉద్యోగంకోసం, ఉపాధికోసం మాత్రమే చదువు అన్నప్పుడు చదువు యొక్క పాత్రని స్ఫూర్తినీ, ప్రాణశక్తినీ మనం తగ్గించేస్తున్నాం.

సుమారు 110 సం॥ క్రిందట 'కన్యాశుల్కం' నాటకంలో "మా అబ్బి ఇంగ్లీషు చదువులన్నీ చదివేస్తే అగ్రహారం భూములన్నీ కొనేయడూ?" అని వెంకటేశం తల్లి ముచ్చటపడుతుంది.

ఇప్పుడు మనల్ని ఏలినవారు కూడా అదే అవగాహనతో, అదే భాషలో మాట్లాడడం దురదృష్టం. అందుకే పెద్దవాళ్ళు చెబుతారు.

"అవును చరిత్ర పునరావృతం అవుతుంది.
మొదట్లో కామెడీగా - అంతిమంగా ట్రాజెడీగా."

కొత్త శీర్షిక... ఈ వారం నుంచే...



# గ్లోబల్ స్కిల్స్

విజయానికి వీసా

ప్రజ్ఞమహర్షి

# ఇంగ్లీషొక్కటే ఇకపై చాలదు

గ్లోబల్ స్కిల్స్ అంటే ఏమిటి? అవి నేర్చుకోవడానికి కావలసిన అర్హతలు ఏమిటి?
స్థూలంగా చెప్పాలంటే గ్లోబల్ స్కిల్స్ మూడు రకాలు.

1. మనుషులతో సంబంధాలను నెరిపేందుకు కావలసిన స్కిల్స్.
2. సమస్యలు, నిర్ణయాలు, మార్పులు, సంక్లిష్టమైన ఆలోచనలు కలిగిన పని వాతావరణంలో అవసరమైన స్కిల్స్.
3. నిత్యం తమను తాము మలుచుకుంటూ అభివృద్ధి పరుచుకునేందుకు అవసరమైన స్కిల్స్.

ఇలా స్థూలంగా మూడు విభజనలు చేసినా గ్లోబల్ స్కిల్స్ ఒక దానితో మరొకటి విడదీయలేనంతగా ముడిపడి ఉంటాయి. ఎలాగో వివరంగా తర్వాతి భాగాలలో చూద్దాం.

ముందు అసలు ఈ స్కిల్స్ ఎందుకు అవసరమో, ఆ నేపథ్యం ఏమిటో తెలుసుకుందాం.

ఎలక్ట్రానిక్, కంప్యూటర్, సాఫ్ట్‌వేర్, బయోటెక్ లాంటి రంగాలకు ప్రపంచ వ్యాప్తంగా డిమాండ్ రావడం వలన ఆ రంగాలలోని భారతీయులకు దేశ విదేశాలలో అనేక ఉపాధి అవకాశాలు వచ్చాయి. ఇంకా చెప్పాలంటే ఇతర ప్రపంచ దేశాలకన్నా భారతీయులే ఎక్కువగా ఈ అవకాశాలను అందిపుచ్చుకొని అభివృద్ధి చెందారు. కాని ప్రస్తుతం భారతదేశానికి ఇతర దేశాల నుంచి తీవ్రమైన పోటీ ఎదురవుతోంది. రానున్న రోజుల్లో ఇంకా ఎన్నో దేశాలు భారత్‌కు పోటీగా మార్కెట్‌లోకి దిగబోతున్నాయి కూడా.

నిన్న మొన్నటి వరకూ భారతీయులకు 'ఇంగ్లీషు'లో ప్రవేశం ఉండటం ఒక ముఖ్యమైన స్కిల్‌గా పరిగణించబడేది. కాని యిప్పుడు పరిస్థితి మారింది. అమెరికా, యూరప్ దేశాలు చైనా, రష్యా, తూర్పు యూరప్ దేశాలలో ఇంగ్లీషు పరిజ్ఞానం పెరిగేందుకు ఇప్పుడు కోట్ల కొలది డాలర్లు విరాళంగా యిస్తున్నాయి. కాబట్టి ఆ దేశాలు భవిష్యత్తులో మనకు గట్టి పోటీ యివ్వగలవు. ఇక ఇంగ్లీషు భాష రాని, వాడని జర్మనీ, జపాన్, ఫ్రాన్స్ లాంటి దేశాలు నాణ్యత, సృజనాత్మకతలతో ప్రపంచ మార్కెట్‌ను ఆక్రమించుకొని ఎలాగూ ముందు వరుసలో ఉన్నాయి.

మరి మన పరిస్థితి ఏమిటి?

దీనికి జవాబు గ్లోబల్ స్కిల్స్‌ను పెంచుకోవడమే.

'గ్లోబల్ స్కిల్స్' అంటే ఏ రంగంలో అయినా ఇతర దేశాల వ్యాపార సంస్థలుకాని, వాటిలో పని చేసే ఉద్యోగులుకాని ఇవ్వలేని 'అదనపు ఆకర్షణను అదనపు విలువ'ను యివ్వగలగడం. ఇలా నిరంతరం అదనపు ఆకర్షణ, విలువ యివ్వలేని వ్యాపారసంస్థలు, ఉద్యోగులు, దేశాలు పోటీలో వెనుకబడి, పూర్తిగా తెరమరుగవుతాయని నేడు ప్రపంచదేశాలు గ్రహించాయి. అందుకే 'గ్లోబల్‌స్కిల్స్' కలిగిన నిపుణుల కోసం అవి అన్వేషిస్తున్నాయి.

ఉదాహరణలతో చెప్పాలంటే ఒక వ్యక్తి సాఫ్ట్‌వేర్ రంగంలో గొప్ప నిపుణుడు కావచ్చు. కాని ప్రపంచానికి యివాళ ఆ నైపుణ్యం కేవలం 15 శాతమే అవసరం. ఆ నైపుణ్యంతో విజయం సాధించాలంటే మాత్రం 85 శాతం గ్లోబల్‌స్కిల్స్ అవసరం. ప్రపంచ ప్రఖ్యాత హార్వర్డ్, స్టాన్‌ఫర్డ్ విశ్వవిద్యాలయాలు తమ సర్వేలతో ఈ సంగతినే నిరూపించాయి.

అప్పటివరకూ సాంకేతిక నైపుణ్యంతోనే అంతా సాధించవచ్చని గుడ్డిగా నమ్ముతూ వచ్చిన వ్యాపార సంస్థలు ఈ సర్వేలు చూసి బెంబేలెత్తి పోయాయి. కొన్ని సంస్థలైతే ఈ సత్యాన్ని గ్రహించిందే తడవుగా తమ దగ్గర పనిచేసేందుకు గ్లోబల్ స్కిల్స్ ఉన్నటువంటి నిపుణుల గురించి వెతకడం ప్రారంభించాయి. ఈ వెతుకులాటకు మనం జవాబు కాగలమా లేదా అనేదే ఇప్పుడు మన ముందున్న ప్రశ్న.

మన దేశంలో సాఫ్ట్‌వేర్, హార్డ్‌వేర్, ఇంజనీరింగ్ రంగాలలో సాంకేతిక నైపుణ్యాలు కలిగిన వ్యక్తులకు కొదవలేదు. కాని గ్లోబల్ స్కిల్స్ కలిగిన నిపుణుల కొరత మాత్రం ఉంది.

అందుకే అనేక కంపెనీలు తమ తమ మేనేజర్లకు, ఉద్యోగులకు గ్లోబల్ స్కిల్స్‌లో శిక్షణ యిప్పించడానికి పూనుకుంటున్నాయి.

ఆ స్కిల్స్ ఏమిటి? అవి ఎలా నేర్చుకోవాలి? అవి నేర్చుకునేందుకు అర్హతలు ఏమిటి?

వచ్చేవారం నుంచి వరుసగా తెలుసుకుందాం.

ఆదివారం ఆంధ్రజ్యోతి • 8 మే, 2005 • 13

సౌజన్యం

ఆంధ్రజ్యోతి

# ఉపాధి కల్పనకోసం ఇంగ్లీషు కొన్ని మూఢనమ్మకాలు

చదివే చదువంతా ఉపాధికోసం అనుకుంటే అదీ పెద్ద అబద్ధం. ఇంగ్లీషులో చదువుకుంటేనో, ఇంగ్లీషులో ధారాళంగా మాట్లాడితేనో ఉద్యోగాలొస్తాయి అనేది చిత్రమైన కట్టుకథ. ఉదాహరణకి భారతదేశంలో పోటీ పరీక్షలకి వెళ్ళేవాళ్ళల్లో ముఖ్యంగా ఉత్తర భారత దేశంలో చూస్తే ఇంగ్లీషు పరిజ్ఞానం నామమాత్రమే. వాళ్ళ విషయ పరిజ్ఞానం తక్కిన వారికి ఏమి తీసిపోదు. సర్వీసులో చేరినప్పుడు ప్రొబేషన్ పీరియడ్‌లో కూడా నింపాదిగా ఎదుగుతారు. మాట్లాడటంలో రాయడంలో చాలా స్పష్టంగా, సులభంగా సరళంగా ఇంగ్లీషులో రాసుకోవచ్చు. IAS and Allied సర్వీసులు ఒక భాగమైతే, UPSC ప్రకటించే ఇంజనీరింగ్ సర్వీసులు, ఎకనమిక్ సర్వీసులు, SSC బ్యాంకింగ్ రిక్రూట్‌మెంట్ బోర్డులు- వీటన్నింటిలో కూడా ఒక్క బ్యాంకింగ్ రంగంలో తప్పితే చాలా వాటిల్లో ఇంగ్లీషు ప్రాథమిక పరిజ్ఞానం సరిపోతుంది.

చాలా ప్రధానమైన పోటీ పరీక్షలు కూడా ప్రాంతీయ భాషల్లో రాసుకోవచ్చు. బీహార్, యు.పి, తమిళనాడు, కేరళ రాష్ట్రాలనుండి వచ్చిన కొంత మంది ఉన్నతాధికారులు ప్రాంతీయ భాషల్లోనే రాసి విజయపతాకాన్ని ఎగురవేశారు. ప్రభుత్వ, ప్రభుత్వ సంస్థలు నిర్వహించే పోటీ పరీక్షల వరకు ఇంగ్లీషు ప్రాథమిక పరిజ్ఞానం చాలు అనేది గుర్తించాల్సిన సత్యము.

ఇక ప్రైవేటు రంగానికి వస్తే ఇన్ఫోసిస్, అమెజాన్,కాగ్నిజంట్ మొదలైన సంస్థల్లో వ్యక్తికున్న విషయ అవగాహన పరిగణన్నలోకి తీసుకుంటారు. దాంతోపాటు ఇంగ్లీషులో భావవ్యక్తీకరణ సామర్థ్యము కూడా పరిగణనలోకి తీసుకుంటారు. దానికి కావలసింది కమ్యూనికేటివ్ ఇంగ్లీషు అని ఒక ప్రత్యేకంగా డిజైన్ చేయబడిన సిలబస్ ఉన్నది. దాంట్లో ప్రాక్టీస్ చేస్తే కమ్యూనికేషన్ ఇంగ్లీషు చాలా సులభసాధ్యము.

నాకు తెలిసిన ఒక చాలా తెలివైన చురుకైన తెలుగు మీడియం పిల్లవాడు కమ్యూనికేషన్ ఇంగ్లీష్‌ని ప్రాక్టీస్ చేసి వామనుడు, త్రివిక్రముడు లాగా పెరిగిపోవటం చూశాను. ఇప్పుడా పిల్లవాడు ఐ.టిలో మంచి స్థానంలో ఉన్నాడు.

ఇంగ్లీషులో నిజంగా మాట్లాడాల్సి వస్తే దాన్ని నేర్చుకోవడానికి కావాల్సిన శాస్త్రీయంగా రూపకల్పన చేయబడిన పాఠ్యప్రణాళికలున్నాయి. ఈ కాస్త సమస్యకి పదేళ్ళపాటు ఇంగ్లీషు మీడియంలోనే చదవాలి అనడం మానవ నైతిక సూత్రాలకు విరుద్ధము, అశాస్త్రీయం.

స్వయంగా వృత్తి నైపుణ్యాలకు సంబంధించి C.A. వంటి కోర్సులవాళ్ళకి చట్టపరమైన అవగాహన వాటిని అనుసంధానించుకోవడం మొదలైన అంశాల్లో ప్రత్యేక శిక్షణా కార్యక్రమాలున్నాయి. కోర్టుల ముందు, ట్రిబ్యునళ్ళ ముందు వాదనలు వినిపించాలన్నా క్లయింట్లతో, వ్యవహారాలు చక్కబెట్టాలన్నా వృత్తిపరమైన పారిభాషిక పదకోశం (JARGON) తో పాటు సాధారణ వ్యక్తీకరణ సామర్థ్యాలు చూస్తాము.

**ఉదా:- ఒక న్యాయవాదికి, ఒక C.A, C.S. లకి మన సమస్య చెప్పేటప్పుడు మనం అతనికి వాస్తవాలు అర్థమయ్యాయా లేదా వాటిని చట్టపరిధిలో అన్వయించగలుగుతున్నాడా ? లేడా? అన్నది మాత్రమే చూస్తాం. అంతేకాని అతని కెంత ఇంగ్లీషు వచ్చో అన్నది అనవసరం. అతనికి విషయంపట్ల ఉన్న అవగాహన క్లయింట్లతో వ్యహరించే తీరు పట్టి అతని విజయరహస్యం ఆధారపడి ఉంటుంది.**

ఇతర దేశాలకు వెళ్ళాలంటే టోఫెల్, జీ.ఆర్.ఈ, ఐ.ఈ.ఎల్.టిఎస్ వంటి పరీక్షల్లో ఇంగ్లీషు కాస్త కష్టంగానే ఉంటుంది. వాటిని విజయవంతంగా ఎక్కువ

మార్కులతో పూర్తిచేసిన వాళ్ళల్లో చాలా మంది తెలుగు మీడియం నేపథ్యం ఉన్నవాళ్ళే.

దీన్ని బట్టి ఇంగ్లీషుకి, ఇంగ్లీషు మీడియంకి సంబంధం లేదు అని అర్థమవుతుంది. ఈ సందర్భంలో ఇంగ్లీషు పరిజ్ఞానంగురించిన శ్రీశ్రీ గారి జీవితంలో ఒక సన్నివేశాన్ని మీతో పంచుకుంటాను.

శ్రీశ్రీ గారు పాశ్చాత్య ప్రపంచంలో పర్యటించారు. ఆ సమయంలో ఒక నోబుల్ అవార్డు గ్రహీతను కలుసుకున్నారు. పరిచయాలయ్యాయి. శ్రీశ్రీ గారు ఆయన టేబుల్ మీద ఉన్న ఒక ఇంగ్లీషు పేపరు తీసుకొని అందులో పజిల్‌ని పూర్తి చేయడంలో నిమగ్నమయ్యాడు. ఆ పరిసరాలతో సంబంధం లేకుండా ఈ పజిల్ పూర్తి చేస్తూ ఉండిపోయారు శ్రీశ్రీ కొద్ది నిమిషాల పాటు. ఇది గమనించిన ఆ నోబుల్ గ్రహీతకు చిర్రెత్తుకొస్తోంది. కొద్ది క్షణాల తరువాత ఆ పజిల్ పూర్తి చేసి శ్రీశ్రీ గారు ఆయనకి తిరిగిచ్చేశాడు. దాంతో దిమ్మెరపోయిన ఆయన "నేను నిన్నట్నుండి దీంతో కుస్తీపడుతున్నాను. నావల్ల తేలలేదు. మీకు ఇంత ఇంగ్లీషు ఎలా వచ్చింది?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించాడు. దానికి శ్రీశ్రీ గారు ఠక్కున చెప్పిన సమాధానం "నాకంత తెలుగు వచ్చు కాబట్టి". అంటే శ్రీశ్రీ జీవితంనుండి ఇది మనకు పాఠం, గుణపాఠం కూడా. మాతృభాషల్లో చక్కగా చదువుకున్నవాళ్ళు, మాట్లాడగల్గినవాళ్ళు ఇతర భాషల్ని కూడా త్వరగా నేర్చుకుని ఆకళింపు చేసుకోగలుగుతారు అన్నది సత్యం. ఏతావతా ప్రతిభాష పని చేసే విధానంలో కొన్ని అంతర్గత సూత్రాలుంటాయి. సాధారణ పరిభాషలో దీన్ని వ్యాకరణ సూత్రాలు అంటారు. మాతృభాష నేర్చుకునేటప్పుడు మనకి తెలీయకుండానే మనం ఆ అంతర్గత సూత్రాల్నీ సహజాతి సహజంగా నేర్చుకుంటాము.

అందువల్ల మాతృభాష మీద పట్టున్నవారు ఇతర భాషల మీద పట్టు సాధించడం సులభము.

20 వ శతాబ్దం తొలి రోజుల్లో సర్ శ్రీనివాసశాస్త్రి అని ఒక గొప్ప విద్యావేత్త ఉండేవాడు. ఆయన ఇంగ్లీషులో ప్రసంగిస్తుంటే ఇంగ్లీషు వాళ్ళు కూడా

మంత్రముగ్ధులై వినేవాళ్ళు. ఆయన ఇంట్లో, స్నేహితుల్తో మాట్లాడేప్పుడు అచ్చంగా తమిళంలోనే మాట్లాడేవారు.

మనమేమో ఇంగ్లీషులాంటి తెలుగు, తెలుగులాంటి ఇంగ్లీషు, వింగ్లీషులు మాట్లాడే 'తెంగ్లీషులు'గా బ్రతుకుతున్నాం.

**విద్యా దారిద్ర్యం కొనసాగింపు:**

క్రమేణా ప్రభుత్వ బడుల్లో ప్రమాణాలు పడిపోవడం ఆరంభించిన దగ్గర నుండి అది విద్యా ప్రమాణాలకు సంబంధించి మాత్రమే ఆ ప్రశ్న పరిమితం కాలేదు. ~~ఈ~~ **విద్యా ప్రమాణాలు దొరికే చోటు ప్రైవేటు బడులుగా జనం భావించడం మొదలు పెట్టారు.** అందువల్ల జనం వారి కొద్దిపాటి సంపాదన మొత్తాన్ని వెచ్చించయినా ప్రైవేటు బడులలోని ఇంగ్లీషు మీడియం బడులలోకి పంపించడం మొదలుపెట్టారు. అంటే ~~ఈ~~ సమస్యని ఇలా అర్థం చేసుకోవచ్చు. అంటే ఇప్పుడు సమాజంలో రెండు వర్గాలు ఏర్పడ్డాయి. ఒకటి ఉన్నది అమ్ముకునైనా పిల్లల్ని ఇంగ్లీషు మీడియంలోనే చదివించుకోవాలి - అనుకునే వర్గం ఒకటి, విధిలేక ప్రమాణాలు లేవు అని తెలిసినా అనివార్యంగా ప్రభుత్వ బడులకే పంపుతున్నాము - అనుకునే వర్గం ఇంకోటి. అంటే an issue of quality slowly turned out to be in equality issue. ఒకే తల్లి కడుపున పుట్టిన మగ పిల్లవాడు ప్రైవేటు బడికి, ఆడిపిల్ల ప్రభుత్వ బడికి వెళుతున్నారు. బడిలో నాణ్యత విషయంగా ఆరంభమైంది అనుకుంటున్న అసమానత విద్యావ్యవస్థని నిట్టనిలువునా చీల్చేసింది. ఇంట్లో సైతం ఒక తల్లి సంతానంలో కూడా అసమానతలు రావటానికి కారణమైంది అనవచ్చు. ఇది లింగ వివక్షతకు కూడా కారణమైంది.

మొత్తం విశ్లేషణలో ప్రభుత్వ పాఠశాలలో నాణ్యతా ప్రమాణాలు పడిపోవడం మూలకారణం అన్న సత్యాన్ని అటు అధికార యంత్రాంగం, ఇటు పాలనావ్యవస్థ పట్టించుకోవడం మానేశాయి. సమస్యకి ఇతరత్రా కారణాలు వెతికి, ఇంగ్లీషు మీడియం ప్రధాన పరిష్కారం అని చెప్పడం మొదలు పెట్టారు.

మనకి కష్టపడి పనిచేసే అద్భుతమైన ఉపాధ్యాయులు సృజనాత్మకంగా ఆలోచించగలిగే వాళ్ళ టీమ్‌ని చక్కగా నడిపించగలిగేవాళ్ళు ఉన్నారు. కనీసం

నేను కలెక్టరుగా పనిచేసిన చోట కొన్ని స్కూళ్ళల్లో ప్రధానోపాధ్యాయుడు, వారి ఉపాధ్యాయ బృందం చక్కని బోధన ద్వారా పిల్లల్లో పెరిగిన విద్యాప్రమాణాల్ని కళ్ళకి కట్టినట్లు తల్లిదండ్రులకు చూపించి ప్రైవేటు బడులనుండి వందల సంఖ్యల్లో పిల్లల్ని తిరిగి ప్రభుత్వ బడులకి రప్పించగలిగారు. ఇటువంటి అసాధారణ విజయాలు అడపా దడపా కొన్ని చోట్ల రాష్ట్రమంతా చూడవచ్చు. దానికి కారణం ఉన్న సమస్యని మనం సరిచేసుకుంటే సరిపోతుంది. ప్రభుత్వ బడులలో ప్రమాణాలు లేవు అన్న మాట సత్యదూరము అని నిరూపించగలగాలి.

ఉపాధ్యాయుల పక్షంగా ఆలోచిస్తే కూడా రేపటినుంచి మనం ఇంగ్లీషు మీడియంలోకి మారిపోదాం అంటే అదీ అంత సులభం కాదు. దానికి మూడు శక్తులు కావాలి. 1) ఇచ్ఛాశక్తి, 2) జ్ఞానశక్తి, 3) క్రియాశక్తి

అంటే దీనికి ఉపాధ్యాయుడు ఇంగ్లీషు భాషని క్షుణ్ణంగా నేర్చుకోవాలన్న బలమైన కోరికని కలిగి ఉండాలి. దానికి కావలసిన పరిజ్ఞానాన్ని పెంపొందించు కోవడానికి కావలసిన శిక్షణా కార్యక్రమాలు, రిసోర్స్‌పర్సన్ అవసరం. శిక్షణా కార్యక్రమంలో పరిజ్ఞానాన్ని పెంచుకోవడానికి కావలసినంత వ్యవధి ఇవ్వాలి.

సాధారణంగా ప్రభుత్వ శిక్షణా కార్యక్రమాలు తూ.తూ మంత్రంగా జరగటానికి ఆస్కారం ఉంది. మూడవది క్రియాశక్తి దీనిలో బోలెడంత ఓర్పుతో, నేర్పుతో పిల్లలకి బోధించాలి. ప్రతి పిల్లవాడితో మాట్లాడాలి, మాట్లాడించాలి. రాయాలి, రాయించాలి. ఇన్ని సాధ్యపడినప్పుడు ఉపాధ్యాయుడు సంసిద్ధమైనట్లు.

ఇక పిల్లల సంగతికి వస్తే వాళ్ళు కూడా సంసిద్ధం కావడానికి చాలా వ్యవధి పడుతుంది. ఇంతచేసి బోధనా విషయపరంగా పెద్దగా మార్పురాదు. న్యూటన్ 3 గమన నియమాలు ఏ భాషలో వచ్చు అన్న దానికన్నా 'వచ్చా రావా' అన్నదే ప్రధానము. అలాగే త్రికోణమితి అర్థమయిందా లేదా అన్నది ప్రధానం కాని, ఏ భాష అన్నది ప్రధానం కాదు.

అందువల్ల విషయాన్ని నేర్పటం దాన్ని సృజనాత్మకంగా ఆలోచించటం, నేర్పడం మొదలైన అంశాలపైన మనసుపెడితే మరిన్ని మంచి ఫలితాలొస్తాయి.

# తెలుగు బాగా రాకపో

- వైజ్ఞానిక చర్చల్లో భాగమైనప్పుడే ప్రపంచ భాషగా తెలుగు వెలుగుతుంది
- 'ఈనాడు'తో భాషావేత్త వెల్చేరు నారాయణరావు

ఈనాడు - హైదరాబాద్

ప్రపంచ వైజ్ఞానిక చర్చల్లో భాగం అయినప్పుడు మాత్రమే తెలుగు ప్రపంచ భాషగా ఎదుగుతుందని ప్రముఖ తెలుగు భాషావేత్త, అమెరికాలోని ఎమరీ విశ్వవిద్యాలయంలో అతిథి ఆచార్యులు వెల్చేరు నారాయణరావు అభిప్రాయపడ్డారు. తెలుగు భాష ఎప్పటికీ చచ్చిపోదని, కోట్లాది మంది మాట్లాడే భాష అంతరించిపోతోందని ఆందోళన చెందడం అనవసరమని ఆయన ధీమాగా అన్నారు. అయితే... తెలుగు భాష ప్రపంచంలోని ఇతర బలమైన భాషలతో సమానంగా ఎదగగలదా? లేదా అనేదే మనం ఆలోచించాల్సిన విషయమని సూచించారు. స్వదేశానికి వచ్చిన సందర్భంగా ఆయన 'ఈనాడు'తో వివిధ అంశాలపై ప్రత్యేకంగా సంభాషించారు.

## తెలుగు భాషా పీఠాలను ఏర్పాటు వేయాలి

తెలుగు వాళ్లు ప్రపంచంలో చాలా దేశాలకి వెళ్లినంత మాత్రం చేత తెలుగు ప్రపంచ భాష అయిపోదు. తెలుగులో వచ్చిన సాహిత్యమూ, విజ్ఞానమూ ప్రపంచంలో ఇప్పుడు బలంగా ఉన్న భాషల్లోనికి వెళ్లాలి. ఆ భాషలో ఉన్న మేధావులు వాటిని చర్చించాలి. ఇలా... ప్రపంచ వైజ్ఞానిక చర్చల్లో భాగం అయినప్పుడు మాత్రమే తెలుగు



ప్రపంచ భాష అవుతుంది. తెలుగు సాహిత్య విమర్శ ప్రపంచ సాహిత్య విమర్శల్లో ఒక ప్రత్యేకమైన గుర్తింపు పొందాలి. సామాజిక శాస్త్రాల మేధావులు తెలుగు సమాజాన్ని పరిశీలించి చేసిన

> "మంచి వచనం రాయలేని జాతికి మంచి భవిష్యత్తు లేదు. తెలుగులో మంచి వచనం రాయగలవారు ఎక్కువగా లేరు."

సిద్ధాంతాలు సామాజిక శాస్త్రాల్లో మౌలిక స్థానాన్ని పొందాలి. ఈ పని చేయడానికి ఉన్న ఒకే ఒక మార్గం ప్రపంచ విశ్వవిద్యాలయాల్లో తెలుగు భాషా పీఠాలను ఏర్పాటు చేయడం.

## తెలుగు నేర్పే బోధకులు లేరు!

ఇలా ఏర్పాటైన పీఠాల్లో చదువుకునే విద్యార్థులు తెలుగు నేర్చుకుని తెలుగు పుస్తకాలు చదివి, అందులోని విషయాల ఆధారంగా తాము చేసిన సిద్ధాంతాలను ప్రపంచ విజ్ఞానంలో భాగం చేస్తారు. సంస్కృతం అలాగే ప్రపంచ భాష అయింది. తమిళం అలాగే ప్రపంచ భాష అవుతోంది. అయితే... పరాయి దేశాల వాళ్లకి తెలుగు నేర్పడానికి కావాల్సిన నైపుణ్యం సంపాదించిన బోధకులు మనకు లేరు. వాళ్లు అనుసరించాల్సిన పద్ధతులు, ఉపయోగించదగిన వ్యాకరణాలూ, ఇతర

### కొత్తతరంపై టీవీ ప్రభావం- 'ఈనాడు' ఎదురీత

తల్లిదండ్రులు కన్నా, కవులు, బడిలో ఉపాధ్యాయులకన్నా తెలుగు టీవీ ప్రభావమే కొత్తతరంపై ఎక్కువగా కనిపిస్తోంది. దీనితోపాటు ఈ కొత్తతరం యువతీ యువకులను పఠితలుగా చేసుకోవాలని ఆశపడే తెలుగు పత్రికలు కూడా ఆంగ్ల పదాలను ఉత్సాహంగా వాడేస్తున్నాయి. 'ఈనాడు' మాత్రం ఇందుకు భిన్నంగా, ధైర్యంగా ఏటికి ఎదురీదుతూ ఇంగ్లిష్ పదాలను వీలైనంత తక్కువగా వాడాలనే పట్టుదలతో పనిచేస్తున్నట్లు కనిపిస్తోంది.



సౌజన్యం
ఈనాడు

# పోతే ఇంగ్లీషూ రాదు

పాఠ్యగ్రంథాలూ తెలుగులో ఇంతవరకు తగినన్ని రూపొందించలేదు. నిజంగా చెప్పాలంటే... నేను తెలుగు నేర్చుకుంటానని అమెరికా నుంచో, ఇంగ్లండు నుంచో, ఇంకా ఇతర దేశాల నుంచో వచ్చిన వాళ్లకి పాఠం చెప్పే విద్యాలయాలు లేవు. మా దేశం వచ్చి మా విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా ఉండండి అని ఇతర దేశాల విశ్వవిద్యాలయాలు ప్రకటిస్తే ఆ ఉద్యోగాలకి అర్హత కలిగిన యువతీ యువకులను మన విశ్వవిద్యాలయాల తెలుగు శాఖలు తయారు చేయడం లేదు.

### ఇతర వర్సిటీల్లోని బోధనను పరిశీలించాలి

రాష్ట్ర తెలుగు ఆచార్యులు ప్రపంచంలోని ఇతర విశ్వవిద్యాలయాల్లో పాఠాలు చెప్పే పద్ధతుల్ని, పరీక్షలు పెట్టే విధానాన్ని నిశితంగా పరిశీలించాలి.

> **"ఇంగ్లీష్‌లో జరిగిన ఊహలకూ, కల్పనలకూ తెలుగులో పర్యాయపదాలు సృష్టించుకోవడమే మన పని అనుకున్నంత కాలమూ తెలుగు భాష ఇంగ్లీష్‌ను అనుసరించే అనువాదక భాష అవుతుంది."**

ఇలా తెలుసుకున్న విషయాలను అనుసరించి వాటిని తమ శాఖలు అనుసరిస్తున్నాయో లేదో గుర్తించి అవసరమైన చర్యలు తీసుకోవాలి. విశ్వవిద్యాలయాల ప్రమాణాలు ప్రపంచంలో అన్నీ ఒకలాగే ఉంటాయి. ఆ ప్రమాణాల స్థాయికి తెలుగు శాఖలు వస్తే మన విద్యార్థులు తెలుగు దేశానికే పరిమితం కాకుండా ప్రపంచస్థాయికి ఎదుగుతారు. మన రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాల తెలుగు శాఖలు ఇక్కడ పాఠాలు చెప్పే వారిని తయారుచేసే పని సమర్థంగా చేస్తున్నాయి. కానీ, వాళ్ళు ప్రపంచంలోని ఏ ఇతర విశ్వవిద్యాలయాల్లోనూ పాఠాలు చెప్పేందుకు ఉపయోగపడరు. ప్రపంచంలోని నాలుగు విశ్వవిద్యాలయాల్లో మా విద్యార్థులు పాఠాలు చెప్పగలరనే, అక్కడి ఆచార్యులతో సమాన స్థాయిలో పనిచేయగలరనే ధీమాను మన తెలుగు శాఖలు సంపాదించాలి.

### వ్యామోహమే అందుకు కారణం

తెలుగులో ఇంగ్లిష్ మాటలు మూడు కారణాల వల్ల వస్తున్నాయి. ఒకటి అవసరం వల్ల, మరొకటి అలవాటు వల్ల, మూడోది వ్యామోహం వల్ల! మొదటి కారణం వల్ల వచ్చిన మాటలు ఎవరూ మానివేయక్కర్లేదు. రెండో కారణంవల్ల వచ్చే ఇంగ్లిష్ మాటలని వీలైనంత గట్టిగా ప్రయత్నం చేసి మార్చుకోవచ్చు. కానీ ఇప్పుడు తెలుగులో వినిపించే ఇంగ్లిష్ మాటలు ఎక్కువ భాగం వ్యామోహం వల్ల వచ్చినవే. రోజూ వినేదీ, మాట్లాడేదీ తెలుగు అనటానికి ధైర్యం చాలట్లేదు. ఇంగ్లిష్‌నూ మన పిల్లలు సమర్థంగా నేర్చుకోవడం లేదు. వారు మాట్లాడేది ఇంగ్లిషే కాదు.

### మంచి వచనం ద్వారానే....

తెలుగు బాగా రాకపోతే ఇంగ్లిష్ కూడా రాదు. తెలుగు బాగా నేర్చుకున్న వారే ఇంగ్లిష్‌ను చక్కగా నేర్చుకోగలరు. దీనిపై విస్తృతస్థాయిలో ప్రచారం జరగాలి. తెలుగులో ఆలోచన వృద్ధి చెందాలంటే అది వచనం ద్వారానే జరగాలి. మంచి వచనం రాయలేని జాతికి మంచి భవిష్యత్తు లేదు. తెలుగులో మంచి వచనం రాయగలవారు ఎక్కువగా లేరు. యువతీ యువకులు నేర్చుకుంటున్న విషయాల గురించి తెలుగు వచనంలో రాయగలిగేలా శిక్షణ పొందాలి. చరిత్ర, రాజనీతి, సమాజశాస్త్రం, మతం, కులం, అంతర్జాతీయత, ఇలాంటి అనేక విస్తృత విషయాలపై ఆలోచనా పూర్వకమైన విశ్లేషణతో కూడిన సమర్థమైన పుస్తకాలు తెలుగులో ఇప్పుడున్న వాటికంటే కొన్ని రెట్లు ఎక్కువగా రావాలి. ఇంగ్లిష్‌లో ఉన్న సమాచారాన్ని తెలుగులో చెప్పడమే పరమావధిగా ఉండకూడదు.

### అప్పుడే తెలుగుకి స్వతంత్ర స్థితి!

తెలుగులో చేసిన ఊహల్ని ఇంగ్లిష్‌లోనికి మళ్ళిస్తే ఆ శాస్త్రం అభివృద్ధి చెందుతుందన్న నమ్మకం మేధావులకి కలగాలి. ఇంగ్లిష్‌లో జరిగిన ఊహలకూ కల్పనలకూ తెలుగులో పర్యాయపదాలు సృష్టించుకోవడమే మన పని అనుకున్నంత కాలమూ తెలుగు భాష ఇంగ్లిష్‌ను అనుసరించే అనువాదక భాష అవుతుంది. ఆ స్థితిని మార్చగలిగిన రోజునే తెలుగుకి స్వతంత్ర స్థితి వస్తుంది.

#### నేపథ్యం



వేల్చేరు నారాయణరావు 1974లో ఆంధ్రా విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ అందుకున్నారు. మేడిసన్ యూనివర్సిటీ ఆఫ్ విస్కాన్సిన్‌లో వివిధ హోదాల్లో పనిచేశారు. యూనివర్సిటీ ఆఫ్ షికాగోలోనూ బోధించారు. తెలుగులోని 15 గ్రంథాలను ఆంగ్లంలోనికి అనువదించారు. తాజాగా మను చరిత్రను తర్జుమా చేశారు. విజయనగర సామ్రాజ్యంలో వెలువడిన పుస్తకాలను సంక్షిప్తీకరించి ఒక పుస్తకాన్ని తీసుకురావాలన్న ప్రయత్నాల్లో ఉన్నారు.


అక్కా
అమ్మని
ఇంగ్లీషులో
ఏమంటారు?


ఏమోరా
తెలీదు!


మీరు
బాగు పడరే!



# భాషలు ఎలా దెబ్బతింటాయి

ఇప్పుడు జరుగుతున్న పరిణామాలు చూస్తే తెలుగువాళ్ళు ఒక జాతిగా, ఒక భాషగా, ఒక వాఙ్మయముగా చాలా చాలా బాధాకరంగా ఉన్న పరిస్థితులు దాపురించాయి. అవేమిటో వివరించడం నా బాధ్యత అనుకుంటున్నా.

ఏ భాష అయినా శక్తిమంతంగా, జీవవంతంగా ఉండాలంటే అది ప్రజల మధ్య నిత్య వ్యవహారంలో జీవవంతంగా కళకళలాడుతూ ఉండాలి. ప్రజల నిరాదరణకి గురైన భాష మనజాలదు. బ్రతికి బట్టకట్టలేదు.

ప్రజలు తమ మాతృభాషపట్ల ఆదరాన్ని అభిమానాన్ని కలిగి ఉండాలంటే వాళ్ళ దైనందిన జీవితంలో భాష భాగం కావాలి. ఇలా మన దైనందిన జీవితం మనల్ని నడిపించే ప్రభుత్వాల బహురూప చర్యలతో అనుక్షణం ప్రభావితం అవుతుంది. ఒక రైతుకిచ్చే సబ్సిడీ, ఒక డెంగీ వ్యాధిని అరికట్టే వైద్యుడి చర్యలు, గర్భిణీ స్త్రీలు తీసుకోవలసిన పౌష్టికాహారం ఇలా ఒక వ్యక్తి తల్లి గర్భంలో పడ్డ దగ్గర్నుండి భూమి గర్భంలోకి జారిపోయే వరకు అన్ని దశల్లో ప్రభుత్వం నడిపే వ్యవస్థలు, సంస్థలు వివిధ కార్యకలాపాలు మనల్ని నిరంతరం భాషాపరంగా మన మీద ప్రభావం చూపుతూనే ఉంటాయి.

జనన ధ్రువీకరణ పత్రం మొదలుకొని పెన్షన్లు, ఇతరత్రా అన్ని వ్యవహారాల్లో భాష ప్రభావం ఉంటుంది. పాలనా రంగం ఇంగ్లీషులోనే ఉంది. చట్టాలు, జి.ఓ.లు ఇంగ్లీషులోనే ఉంటాయి. అధికారులు ఇంగ్లీషులో బ్రీఫింగ్ చేస్తారు. చివరికి మన అర్జీలు సైతం ఇంగ్లీషులోనే రాసిస్తున్నాం. సమాధానాలు సైతం ఇంగ్లీషులోనే వస్తాయి. ఇక మీడియం కూడా ఇంగ్లీషు అయితే మన పిల్లలు నేర్చుకునే అన్ని విషయాలు మన భాషలో ఉండవు. అందువల్ల మన మాతృభాషని మాట్లాడాలనుకుంటే మాట్లాడవచ్చు. లేదంటే మానేయవచ్చు.

మనకి 21 ద్రావిడ భాషలున్నవి. వాటిలో తెలుగు మధ్య ద్రావిడ సమూహానికి చెందింది. మన గుంపులోకే చెందిన గోండు, కువి, మాల్తోని మొదలైన భాషలు ఇప్పుడున్న తరం కాకుంటే రాబోయే తరంతో దాదాపు అంతరించి పోబోతున్నాయి. కారణం వాటిని మాట్లాడే గిరిజన ప్రాంతాల్లో పాలనావ్యవహారాలు, బోధనా వ్యవహారాల్లోగాని గత ఐదు దశాబ్దాలుగా వాళ్ళ భాషల్లో జరగలేదు.

గత రెండు తరాలనుండి వాళ్ళు వాళ్ళ పిల్లలు తెలుగు మీడియం బళ్ళో లేదా ఇంగ్లీషు మీడియం బళ్ళల్లో చదువుకున్నారు. వాళ్ళకి తెలుగో, ఇంగ్లీషో వచ్చు. అందువల్ల వాళ్ళు వాళ్ళ మాతృభాషని మాట్లాడడం అనేది ఐచ్ఛికంగా మారింది. అక్కడికి వెళ్ళిన ఉపాధ్యాయులు అందరూ 'ఎక్స్‌పోర్టు క్వాలిటీ' తెలుగు ఉపాధ్యాయులు.

భాషా సంస్కృతుల విషయంలో రాజ్యాంగం స్థానిక భాషలన్నింటిలో బోధన జరగాలి అని ఆర్డర్ 350(ఎ) ప్రకారం పేర్కొంటుంది. దాన్ని పూర్తిగా పక్కన పెట్టేయడం వల్ల మొత్తం 21 ద్రావిడ భాషల్లో 15 భాషలు అంతరించి పోతున్నాయి. పాలనా వ్యవహారాల్లో బోధనా మాధ్యమంగాగాని, సాంస్కృతిక మాధ్యమంగాగాని మాతృభాషకు నిలువ నీడలేకుండా చేసే ప్రభుత్వ విధానాలు ఖచ్చితంగా భాషని చంపేస్తాయి అనడానికి ఉదాహరణ.

ఒక భాష అస్తమించే ముందు దశల్లో ఈ క్రింది మార్పులు చోటుచేసుకొంటాయి.

1. పాలనా వ్యవహారాలనుండి నిష్క్రమించడం.
2. బోధనా మాధ్యమంగా నిష్క్రమించడం.
3. దైనందిన వ్యవహారంలో వాడుక ఐచ్ఛికంగా మారడం.
4. సాంస్కృతికంగా భాషీయులలో ఆత్మన్యూనత పెంపొందించుకోవడం.
5. భాషావ్యవహారాలు నామమాత్రం కావడం.
6. భాషావ్యవహర్తల సంఖ్య నామమాత్రం కావడం.

ఎవరు అంగీకరించినా అంగీకరించకపోయినా అంతరించి పోతున్న భాషా సముదాయాల్ని చూసినపుడు ఆ లక్షణాలు ఇప్పుడిప్పుడే మన తెలుగు భాషకూ కనపడుతున్నాయి.

తెలుగుని ఒక భాషగా బోధిస్తామని, అందువల్ల తెలుగుకి వచ్చే నష్టం లేదు. అని ఇంకోవాదన తరచూ వినపడుతోంది. వాస్తవానికి ఒక subject గా తెలుగును అన్ని స్థాయిల్లో ఉంచుతామని ప్రభుత్వాలు ప్రకటిస్తున్నాయి. విద్యా విధానంలో 'త్రిభాషా సూత్రం' ప్రకారం తెలుగు ఇంతకు ముందు కొనసాగింది. ఇప్పుడూ కొనసాగుతుంది. దీనికోసం ఎవరూ ప్రత్యేకించి అపారమైన దయచూపాల్సిన అవసరం లేదు. ఐతే సమస్య అంతా తెలుగును ఒక బోధనాంశంగా పెడితే భాషా సాహిత్యాలు మాత్రమే నేర్చుకోవడంకోసం నేర్చుకొనడంగా ఉంటాయి. జీవితానికి - విజ్ఞానానికి - మనిషి మానసిక వికాసానికి - సమాజ అభ్యుదయానికి దైనందిన జీవితానికి మాతృభాషకి ఉన్న సహజ సంబంధం తెగిపోతుంది. నేర్చుకునే పిల్లవాడు కూడా ఇది 'తప్పనిసరి తద్దినం'గానే భావించే అవకాశం ఉంది. IPC 304 (A) మర్డర్ బై నెగ్‌లెక్ట్ గురించి చెబుతున్నట్లే మన మాతృభాష విషయంలో భవిష్యత్తులో జరగబోయేది ఇదే అని అనిపిస్తుంది.

ఎవరినైనా హత్య చేస్తే అది నేరం. ఈ చంపడం లేదా హత్య చేయడం అనే పనుల్లో నెత్తురూ కత్తులూ మొదలైన వన్నీ కనపడతాయి. ఒక వ్యక్తిని పట్టించుకోకుండా నిర్లక్ష్యానికి గురిచేస్తే పోషణ మందులు లేక అతను మరణించవచ్చు. దానిని death by neglect అంటారు.

భాష విషయంలో మనకి కూడా అలాంటి పరిస్థితే రాబోతుందా? కాదు అని ధైర్యం చెప్పేవారేరి?

# మీ పిల్లలు ఇంగ్లీషు మీడియంలో చదవట్లేదా?

ఈ మధ్య కాలంలో మీ పిల్లలు ఇంగ్లీషు మీడియంలో చదవట్లేదా? అన్న వాదన తరచూ వినిపిస్తుంది. మీకు లభించిన మంచి అవకాశాలు పేదవాళ్ళ పిల్లలకి అక్కర్లేదా? అన్న వాదన కూడా వినపడుతోంది. దాన్ని గురించి రెండు ప్రధానమైన విషయాల్ని మనం అర్థం చేసుకోవాల్సి ఉంటుంది.

దేశానికి స్వతంత్రం వచ్చిన తరువాత ఆర్థిక రంగంలో నిలదొక్కుకున్న నగరాలలో ముఖ్యంగా కలకత్తా, మద్రాసు, ప్రెసిడెన్సీలోను, ఢిల్లీలాంటి మహా నగరాలలో నివసించే ఆర్థిక శిష్ట వర్గం, భాషావిధానాన్ని పరోక్షంగా శాసించడం మొదలు పెట్టింది. ఆర్థిక, మార్కెట్ కార్యకలాపాలలో ఇంగ్లీషుని విరివిగా వారి వారి కార్యకలాపాలకోసం వాడుకుంటూ పోతున్న సందర్భంలో మన దేశ ప్రజలకి లేదా స్థానిక ప్రజలకి లేదా స్థానిక భాషలకీ అనుకూలమైన విధానాలను రూపకల్పన చేసుకోవడంలో మన ప్రభుత్వాలు చొరవ చూపలేదు. కారణంగా **ఇంగ్లీషువాడు వదిలి వెళ్ళిపోయిన ఇంగ్లీషు మాత్రం పెత్తనం చేస్తూనే ఉంది.**

మొదటగా 'నూతన విద్యా విధానం' 2019 ఏమంటుందో చూద్దాం. ఇంగ్లీషుకి ఎందుకు జనం ఎగబడుతున్నారు అన్న దానికి స్వతంత్రా నంతరం

సమాజంలో ఆర్థిక శిష్ట వర్గం ఒకటి తయారైంది. ఆర్థిక ఉన్నత వర్గాలు ఇంగ్లీషువాడు వెళ్ళిపోయినా ఇంగ్లీషుని కొనసాగిస్తున్నారు.

ఈ ఆర్థిక శిష్ట వర్గం సుమారు దేశ జనాభాలో 15% మంది మాత్రమే ఇంగ్లీషు మాట్లాడగలరు. వాళ్ళని అనుకరిస్తూ ఆశిష్ట వర్గంలో చేరటానికి ప్రయత్నించే ఒక కొత్త వర్గం పుట్టుకొచ్చింది. వాళ్ళ కందులో చోటు దొరకాలంటే ఇంగ్లీషు రావాలి అని అనుకోకుండానో, అనుకునో ఇంగ్లీషు నేర్చుకోవడం మొదలు పెట్టారు. ఈ చిన్న వర్గం ఇంగ్లీషు విద్యావంతులనే విద్యావంతులుగా భావించడం ప్రారంభించింది.

ఉద్యోగ మార్కెట్లో ఇంగ్లీషుతో అవసరంలేని రంగాల్లో కూడా ఇంగ్లీషు పరిజ్ఞానాన్ని పరిగణనలోనికి తీసుకోవడం మొదలు పెట్టారు. ఈ పరిస్థితి ఈ వైఖరి సమాజంలో చాలా వర్గాల్ని అధిక జీతాలు చెల్లించే రంగాలకు, ఉన్నత సామాజిక ఆర్థిక వర్గాలకు, పెద్ద జీతాలిచ్చే కొలువులకూ దూరం చేసింది.

ఈ మధ్య కాలంలో చాలా రాష్ట్ర ప్రభుత్వాలు స్థానికులకు మీరు పెట్టే పరిశ్రమల్లో ఇంత శాతం ఉద్యోగాలు ఇవ్వాలివంటి చట్టాల్ని రూపొందిస్తున్నారు. అలాగే మీరు చేసేటువంటి ఎంపిక విధానంలో గూడా తప్పకుండా మా ప్రాంత ప్రజలకు సన్నిహితంగా ఉండేటువంటి లేదా దగ్గరగా ఉండేటువంటి దేశీయ భాషల్లో నిర్వహించండి అని చెప్పవచ్చు. కావాలంటే ఇంగ్లీషులో నైపుణ్యం గురించి ఒక పరీక్ష నిర్వహించుకోవచ్చు. కానీ తక్కిన నైపుణ్యాలన్నీ ఉదా:- గ్రూప్ డిస్కషన్, ఇంకా అనేక రౌండ్లలో జరిగే పరీక్షల్లో ఇంగ్లీషులోనే జరపాల్సిన అవసరం లేదు. స్థానిక భాషల్లో కూడా జరపవచ్చు. పాత రోజుల్లో హిందీ ప్రాంతాల్లో గ్రూపు డిస్కషన్స్ హిందీలోనే జరపడం నాకు తెలుసు.

ప్రజల దగ్గరగా ఉండేటువంటి విధానాలు రూపకల్పన చేయడంలో మనం విఫలమయ్యాము. కారణంగా ఇంగ్లీషు ప్రధానం అన్నట్లు జనం భావించటానికి

ప్రభుత్వాలే కారణమయ్యాయి. దాన్ని పక్కనపెట్టి ఇప్పుడు అందరూ ఇంగ్లీషే నేర్చుకుంటుంటాం అంటున్నారు. పేదవాళ్ళకి కూడా ఇప్పుడు ఇంగ్లీషు విద్యను దూరం చేస్తారా అని మనల్ని అడగడం కాదు ప్రజలే ప్రభుత్వాల్ని అడగాలి. ప్రభుత్వాలు సమాధానం చెప్పుకోవాలి. ప్రజలకు చెప్పవలసింది ఏమిటంటే 'అయ్యా, మేము ఆర్థిక దిగ్గజాలతో మాట్లాడి వాళ్ళని ప్రజలకి సన్నిహితంగా ఉండేటువంటి దేశ భాషలందు సెలక్షన్ ప్రాసెస్‌ని మేం తీసుకురాగలం' అనే ధైర్యాన్ని .

విషాదకరమైన ఈ పరిస్థితి, వైఖరి వల్ల పెద్ద జీతాలిచ్చే కొలువులు, ఉన్నత వర్గాల్లో స్థానం జనసామాన్యానికి భాష కారణంగా దూరమయ్యాయి. సమాజంలో ఆర్థికంగా వెనుకబడిన వర్గాలనుండి కష్టపడేవాళ్ళు, తెలివిగల వాళ్ళు, మంచి నైపుణ్యాలు కలవాళ్ళు, బాగా చదువుకున్నవాళ్ళు కూడా ఈ వలస భాషని మాట్లాడలేక పోవడం వల్ల అవకాశాలు కోల్పోతున్నారు. అందువల్ల తల్లిదండ్రులు తమదికాని భాషలో కూడా పిల్లల్ని చేర్పించాలని ఉవ్విళ్ళూరుతున్నారు. దాన్ని సరిచేయాలంటే ఈ శిష్ట వర్గాల భాషగా ఉన్న ఇంగ్లీషు ప్రాధాన్యతని తీసివేయాలి. స్థానిక ప్రాంతీయ భాషకి సముచిత ప్రాధాన్యం ఇవ్వాల్సిన అవసరం ఉంది.

మన సమాజాన్ని కంటికి కనిపించకుండా తెర వెనుక ఉండి నడిపించే ఒక శిష్ట వర్గాన్ని అదుపు చేయాల్సిన బాధ్యత ప్రభుత్వాలది. గత ఐదు దశాబ్దాల్లో ప్రభుత్వాలు ఏవీ ఈ దశగా కృషి చేయలేదు. దానివల్ల ఈనాటి ఇంగ్లీషు సర్వం అనే ఈ పరిస్థితి దాపురించింది.

ఇంగ్లీషుయొక్క ఆధిపత్యాన్ని అవసరమైనంత మేర వాడుకొని అవసరంలేని చోట తగ్గించడం చాలా అవసరం. జాబ్ ప్రొఫైల్లో అవసరాన్ని బట్టే భాషా ప్రాధాన్యత ఇవ్వాలి. అనవసర ప్రాధాన్యత ఇవ్వకూడదు.

మనకు మన బళ్ళల్లో చెప్పే ఇంగ్లీషు బోధన పూర్తిగా అశాస్త్రీయంగా కంగాళీగా అనువాద పద్ధతిలో జరుగుతుంది. దీనివలన ఇంగ్లీషుని మనం, మన పిల్లలు ఏ మాత్రం నేర్చుకోలేకపోతున్నాం. ఇది విద్యావ్యవస్థలో ఉన్న పెద్ద లోపము.

ప్రభుత్వాలు గుర్తించాల్సింది మనమిప్పుడు నిర్వహిస్తున్న 'స్కూలింగ్ ఆర్గనైజ్డ్ సెక్టార్ ఆఫ్ ఎడ్యుకేషన్' కిందికి వస్తుంది. అంటే దాని అర్థం ట్రెడిషనల్ అనార్గనైజ్డ్ సెక్టార్ కాదు. ఆర్గనైజ్డ్ సెక్టార్‌లోకి ఎడ్యుకేషన్‌ని తీసుకువచ్చాక దాన్ని మరింత వ్యవస్థాకృతంగా పకడ్బందీగా నిర్వహించాల్సిన నైతిక బాధ్యత మన మీద ఉంది. దారినపోయే దానయ్యని రారమ్మని మన స్కూల్లో చేర్చి వారికి సరైన విద్య ఇవ్వకపోతే ఆ తప్పు మనది కాదా?

భాషాపరమైన కాంప్రహెన్షన్, ఎక్స్‌ప్రెషన్ పరంగా ఏ మేరకు ఇంగ్లీషు డిపార్టుమెంట్లు పనిచేస్తున్నాయో రాండమ్ శాంప్లింగ్ ద్వారా తెలుసుకోవాలంటే రెండు రోజులు కన్నా ఎక్కువ పట్టదు. దానికి కావలసిందల్లా ఒకటి ఎవాల్యుయేటరీ,  రెండు తక్షణ పరీక్షలు.

గవర్నమెంటు అనుకుంటే ఇది పెద్ద పనేం కాదు. ఇంగ్లీషు డిపార్టుమెంట్లను బలపరచిన తరువాత ఇంగ్లీషు బోధనా మాధ్యమం అవసరమే లేదు. ఇది అర్థం అయితే చాలు. అదే పదివేలు.

మరలా మొదటికొస్తే పిల్లల్ని ఇంగ్లీషు మీడియం చదివించటానికి కారణము పైన పేర్కొన్న విధంగా 15% ఆర్థిక శిష్ట వర్గం మనల్ని శాసించడం. వాళ్ళు చెప్పిన ప్రమాణాల వెంబడి గుడ్డిగా నడవడం.

ప్రభుత్వాలు ప్రజాస్వామ్యంలో నోరులేని వారికి నోరు అవ్వాలి. దిక్కులేని వారికి దిక్కవ్వాలి. ఏ పని చేసినా ఇది సామాన్య మానవుడి జీవితానికి ఎలా ఉపయోగ పడుతుందో ఆలోచించాలి. మనం చేసే నిర్ణయాల్లో దేశ చరిత్ర,

మన దేశాన్ని తీర్చిదిద్దిన మహనీయులు వాళ్ళ త్యాగాల మూల్యాలు వీటన్నింటినీ పరిగణనలోకి తీసుకొని చేయాలి. ఉదాహరణకి ఒక మెకానికల్ ఇంజనీరుకి అతని సబ్జెక్టు పరంగా అతని జ్ఞానం ఎంత అన్నది ప్రస్తుతం కానీ అతను ఇంగ్లీషులో పెళపెళలాడించగలడా అన్నది అప్రస్తుతం.

ఈ రకంగా ఆలోచించినపుడు మనల్ని నడిపిస్తున్న ఆర్థిక ఉద్యోగ పరమైన శిష్ట వర్గాల మాయలో మనం పడాల్సిన అవసరం లేదు. దేశ భాషలకు తగు ప్రాధాన్యం ఇవ్వాలని కోరుకోవాలి. ఉదాహరణకి జర్మనీ వెళ్ళాలంటే జర్మన్ భాష నేర్చుకోవాలి, చైనాలో మాండరాన్ నేర్చుకోవాలి. ఇండియాలో మాత్రం ఇంగ్లీషు నేర్చుకోవాలి. ఇలాంటి పరిస్థితి రావడానికి కారణం భవిష్యత్తులోకి తొంగి చూడలేని ప్రభుత్వాలు, వాటి పని విధానాలు. వాటిల్లోకి అందరూ నెట్టివేయబడుతున్నారు. అందువల్ల మనం అర్థం చేసుకోవాల్సింది ఇంగ్లీషు మీడియంలో పిల్లల్ని చదివించిన తల్లిదండ్రులు కూడా ఈ ఇంద్రజాలంలో పడి మాయమైనవాళ్ళే. ఇప్పుడు మన ముందుకు రావాల్సిన ప్రశ్న మాది స్వతంత్ర భారత దేశం. మా దేశ భాషల్లోనే మేం చదువుకుంటాం అనేందుకు సామాన్యుడికి కొంత ధైర్యమివ్వాలి.

ఇంగ్లీషు పట్ల ఈ వ్యాసకర్తకి ఏ విధమైన వ్యతిరేకత, ద్వేషం లేదు. స్వయంగా ఇంగ్లీషు భాషా సాహిత్యాలు ఇష్టపడి కష్టపడి చదువుకున్నాడు అని సవినయంగా మనవి చేస్తున్నాడు. మనకి King's English, Queen's English కాదు భావాన్ని తేలిగ్గా అందివ్వగల, అతి సాధారణ ఇంగ్లీష్ కావాలి.

# మాతృభాషతోనే మేధో



వంగీపురం శ్రీనివాసాచారి

విద్యార్థుల అభ్యసన పురోగతే విద్యాప్రక్రియ సార్థకతను నిర్ధారించే సిసలైన కొలమానం. ఉన్నత విద్యలో నాణ్యత ఉట్టిపడాలంటే ప్రాథమిక స్థాయి నుంచే విద్యారంగం పునాదులు పటిష్ఠంగా ఉండాలి. అవగాహన లోపంతో ప్రాథమిక విద్య అభ్యసించిన విద్యార్థులకు భవిష్యత్తులో స్పష్టత, ఆత్మవిశ్వాసం, చొరవ, నైపుణ్యాలు కొరవడతాయి. ఫలితంగా వారి సుదీర్ఘ విద్యాపరిశ్రమ వృథాగా మిగిలిపోతుంది. విద్యావ్యవస్థను కుదిపేస్తున్న వర్తమాన సమస్యల్లో ప్రధానమైంది- బోధన మాధ్యమం! ప్రభుత్వ, ప్రైవేటు రంగాలనే తేడా లేకుండా విద్యార్థులు మాతృభాషలో అభ్యసనం చేయాలా లేక విస్తృతంగా ప్రపంచస్థాయి ఉపాధి అవకాశాలను కట్టబెట్టే భాషగా ముద్రపడుతున్న ఇంగ్లిష్ మాధ్యమంలో చదువు ప్రారంభించాలా అని తల్లిదండ్రులు మొదలుకొని అధికారుల వరకు దాదాపు అన్ని సంబంధిత వర్గాల్లో చాలాకాలంగా లోతైన చర్చ జరుగుతోంది. దీనిపై భిన్నాభిప్రాయాలూ వ్యక్తమవుతున్నాయి. అంతిమంగా ఇంగ్లిష్ మాధ్యమమే భవిష్యత్తులో తమ పిల్లలకు హోదా, సిరిసంపదలను కట్టబెడుతుందన్న దురభిప్రాయం తల్లిదండ్రుల్లో వేళ్లూనుకోవడమే విషాదం!

## ఆంగ్ల వ్యామోహంతో చేటు

అమ్మభాషతో అభ్యసనాన్ని ప్రారంభించాల్సిన చిన్నారులు 'హాయ్, బై'లను నేర్పించే ఇంగ్లిష్ మాధ్యమంతో చదువులకు శ్రీకారం చుడుతుండటం వల్ల మాతృభాషకే కాక మాతృ సంస్కృతికీ చేటు కలుగుతోంది. తల్లిదండ్రుల అవగాహనారాహిత్యం, ప్రైవేటు విద్యాసంస్థల లాభాపేక్ష, ప్రభుత్వ విద్యాసంస్థల నిర్లిప్తతకు అంతిమంగా చిన్నారులు బలవుతున్నారు. ఇంగ్లిష్ పట్ల మోజు వల్ల ప్రభుత్వ పాఠశాలల ఉనికి, లక్ష్యాలు ప్రశ్నార్థకమవుతున్నాయి. ప్రాథమిక విద్యను మాతృభాషలో అభ్యసించినవారే ఇంగ్లిష్ మాధ్యమంలో చదివినవారి కంటే మెరుగ్గా రాణిస్తున్నారన్న వాస్తవాన్ని ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో చేపట్టిన ఒక అధ్యయనం ద్వారా ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం ఇటీవల ప్రకటించడంతో ఒక్కసారిగా అందరిదృష్టి అటువైపు మళ్లింది! ఇప్పటికైనా మనం కళ్లుతెరిచి దేశవ్యాప్తంగా ప్రాథమికవిద్యలో మాతృభాషకే పెద్దపీట వేయాలి. శిశువు తన జీవితంలో సొంతం చేసుకునే మొదటి విజయం స్పష్టతను సాధించడమే! అందుకోసం శిశువుకు ఉపయోగపడే ప్రధాన మాధ్యమం 'భాష'. ప్రతీ ఆలోచనకు ప్రాణం పోసే మహత్తర శక్తి 'భాష' మాత్రమే. అవగాహనను పెంచే ఆలోచనల పరంపర నిరాటంకంగా కొనసాగడం మాతృభాష ద్వారా మాత్రమే సాధ్యపడుతుంది. అంతేకానీ అరువు తెచ్చుకున్న పరాయి భాషతో వల్ల అది సాధ్యంకాదు. విద్య అసలైన నిర్వచనం 'జీవితానికి సంసిద్ధత'. అది సంకుచిత అభిప్రాయానికి పరిమితమైన కాగితపు డిగ్రీల్లో ముద్రితమైన మార్కులు కాదు. విస్తారమైన విశ్లేషణానంతరం విద్యాప్రణాళిక రూపొందిస్తారు. రెండో ఆలోచన లేకుండా అది మాతృభాషలోనే కొనసాగాలి. అవసరం, ప్రాధాన్యాన్నిబట్టి ఇతర భాషలు, ప్రత్యేకించి విదేశీ భాషలు నేర్చుకోవడం ఐచ్ఛిక అంశంగా ఉండాలే తప్ప, నిర్బంధం కాకూడదు.

సమాజానికి నిర్దిష్టమైన జీవనవిధానంపై నిర్మితమైన సంస్కృతి ఉంటుంది. అర్థం, పరమార్థం మారకుండా ఆ సంస్కృతిని భావిపౌరులు, తరాలకు అందించేది మాతృభాష మాత్రమే. సంస్కృతుల మధ్య తేడాలు సహజం. ఈ కారణంగా ఒక సంస్కృతిని ప్రతిబింబించే భాషను ఉపయోగించి వేరొక సంస్కృతికి చెందిన భావితరాన్ని నిర్మించాలని ప్రయత్నిస్తే నేర్చుకునే అంశాలకు, కళ్లెదుట కనిపించే జీవిత వాస్తవాలకు మధ్య అగాధం ఏర్పడి అభ్యసనంలో అభ్యాసకులు తరచూ అస్పష్టత, కంగారుకు గురవుతారు. అలాంటి తరంలో అజ్ఞానం, అసహజత్వం, విపరీత పోకడలు చోటుచేసుకోవడమూ జరుగుతుంది. ఇంతటి నిగూఢ విశ్లేషణను, ఏమరపాటు నిర్ణయాల అవాంఛనీయ పర్యవసానాలను పక్కనపెట్టి, కొన్నిసార్లు కావాలని పక్కకునెట్టి పరభాషా వ్యామోహంలో కొట్టుకుపోతున్న తల్లిదండ్రులు భావిపౌరులకు చేస్తున్న నష్టం అంతాఇంతా కాదు. నేటి తల్లిదండ్రుల్లో ఇంగ్లిష్ పట్ల అవధులు లేని మోజు పెరుగుతోంది. ఇంగ్లిష్‌పై కట్టలు తెంచుకుంటున్న వారి అభిమాన బలహీనత ఫలితంగా వీధివీధినా ఇంగ్లిష్ మాధ్యమ పాఠశాలలు పుట్టుకొస్తున్నాయి. ఇంగ్లిష్ మాధ్యమ పాఠశాలలకు ప్రాధాన్యమిస్తున్న తల్లిదండ్రులు, ప్రవేశాలకై జేబులు ఖాళీ చేసుకుని తమ పిల్లలు భవిష్యత్తులో ఉన్నతస్థితికి చేరుకుంటారన్న ఊహా ప్రపంచంలో విహరిస్తున్నారు. అర్హత, సమర్థత, బోధన నైపుణ్యాలు లేని ఉపాధ్యాయులతో నెట్టుకొస్తున్న ఇంగ్లిష్ మాధ్యమ పాఠశాలల్లో పుస్తకాల్లో ముద్రితమైన ఆంగ్ల వాక్యాలను మినహాయిస్తే, చాలావరకు బోధన జరిగేది స్థానికంగా వాడే మాతృభాషలోనే! కేవలం రాత పరీక్షలను మాత్రమే ఇంగ్లిష్‌లో నిర్వహిస్తారు. ఎలాగూ బట్టీవిధానం అందుబాటులో ఉంది కాబట్టి, విద్యార్థులు ఏదోరకంగా పరీక్షలను ఎదుర్కొంటారు. ఉత్తీర్ణులూ అవుతారు. ఇలాంటివారికే చివరకు అటు మాతృభాష రాక, ఇంగ్లిష్ నైపుణ్యాలూ అలవడక తీవ్రనష్టం వాటిల్లుతుంది. వాస్తవం గ్రహించేలోపే పరిస్థితులు చేయిదాటిపోతాయి. అంతా జరిగాక అంతిమ విద్యాలక్ష్యాలు ప్రవచనాలు, నినాదాలకు మాత్రమే పరిమితమవుతాయి. పట్టభద్రులైనా నైపుణ్యాలు కొరవడినవారు 80శాతానికి పైగా ఉన్నారని నివేదికలు మొత్తుకునేది ఈ రకమైన విద్యార్థులను ఉద్దేశించే!

తెలుగు, ఇంగ్లిష్ భాషలనే తీసుకుంటే రెండింటి మధ్య ఆహారపదార్థాలు,




## 'ఆక్స్‌ఫర్డ్' అధ్యయనంలో వెల్లడి

### చిన్నదేశాల విజయగాథ

- గ్వాటెమలా... మధ్య అమెరికాలోని ఓ చిన్న దేశం. పాఠశాలల్లో మాతృభాషకు ప్రాధాన్యం పెంచడంకోసం ఈ దేశం గడచిన కొన్నేళ్లుగా అహరహం శ్రమిస్తోంది. అందుకోసం ప్రత్యేక విభాగాలను ఏర్పాటు చేసింది. గ్వాటెమలా చేస్తున్న కృషి దేశదేశాలనూ ఆకర్షిస్తోంది.
- అమ్మభాషలో చదువుకోవడంవల్ల విద్యార్థులు క్రమం తప్పకుండా బడిబాట పట్టడంతో... స్కూలు ఎగ్గొట్టే పిల్లల సంఖ్య ఈ దేశంలో బాగా తగ్గుముఖం పట్టింది.
- పరాయి భాషల్లో చదువుకోసం వెచ్చించే వ్యయంతో పోలిస్తే అమ్మభాషలో చదువుకు అయ్యే ఖర్చు బాగా తక్కువ. ఫలితంగా గ్వాటెమలా విద్యా బడ్జెట్లో నిరుడు సుమారు 56లక్షల డాలర్ల మేర ఆదా అయింది.

★ పశ్చిమాఫ్రికాలోని మాలి దేశపు అధికార భాష- ఫ్రెంచ్
★ మాతృభాషలో విద్యాబోధనవల్ల ఇక్కడి విద్యార్థుల్లో సృజనాత్మకత వెల్లివిరుస్తోంది.
★ విద్యా వ్యయంపరంగానూ ప్రభుత్వానికి మునపటితో పోలిస్తే ఇరవై శాతం మేర కలిసివచ్చినట్లు అధ్యయనాలు తేటతెల్లం చేస్తున్నాయి.

⇨ ఫిలిప్పీన్స్... మాతృభాషలో బోధనకు ఇటీవల ప్రాధాన్యం విపరీతంగా పెంచింది.
⇨ అందుకోసం 'యునెస్కో' ఆధ్వర్యంలో సరికొత్త బోధన నమూనాలను రూపొందించింది. వాటిని గ్రామాల్లో విస్తృత ప్రచారం చేసింది. దాంతో విద్యార్థుల్లో భాషపట్ల ఆసక్తి రేకెత్తి వారు పెద్దయెత్తున బడిబాట పడుతున్నారు.

# వికాసం!

వాడే వస్తువులు, సంబంధాలు, సంప్రదాయాలకు సంబంధించి చాలా తేడాలున్నాయి. 'గారె', 'తాళి', వంటి పదాలను ఇంగ్లిష్‌లో వివరించడం ఉపాధ్యాయులకు సవాలే. ఇంగ్లిష్‌లోని అర్థాల కారణంగా 'కజిన్'ను తెలుగులోకి అన్వయించుకోవడమూ విద్యార్థులకు కత్తిమీదసామే! వ్యాకరణం, వాక్యనిర్మాణం, పదజాలం, జాతీయాలకు సంబంధించి రెండు భాషల్లోని తేడాలను అర్థవంతంగా వివరించడం, అవగాహన చేసుకోవడం రెండూ క్లిష్టతరమైనవే. పుట్టినప్పటి నుంచి వింటూ వచ్చి, అంతటా వాడుతుంటే చూసిన అమ్మభాషను కాదని, బోధకులకే పట్టులేని ఇంగ్లిష్‌ను బోధన భాషగా నిర్ణయించి అభం శుభం తెలియని విద్యార్థులపై ప్రయోగాలు చేయడం ఏరికోరి భావితరాన్ని వెనక్కి నెట్టడమే అవుతుంది. మాతృభాషపై పట్టు సాధించాక, విద్యార్థికి భాష, దాని స్వభావం, అధ్యయన నియమాలపై స్పష్టమైన అవగాహన ఏర్పడుతుంది. అప్పుడు అన్యభాషల అభ్యసనం సులువవుతుంది. ఇంగ్లండులో ఇంగ్లిష్ సాహిత్యాన్ని చదివే విద్యార్థులు మన ఆర్.కె. నారాయణ్ రచనలనూ అధ్యయనం చేస్తారు. ఇంగ్లిష్‌పై అసమాన పట్టు సాధించి ప్రపంచ కీర్తిగాంచిన నారాయణ్ సైతం ఇంగ్లిష్‌ను తన భావాన్ని ప్రకటించే మాధ్యమంగా వాడుకున్నారే తప్ప, మాతృభాష సంస్కృతులను మరవలేదు. తన ఇంగ్లిష్ రచనల ద్వారా భారతీయ జీవనశైలిని ఆయన ప్రపంచానికి వివరించే ప్రయత్నం చేశారు. ఇక్కడ గమనించాల్సిన విషయం ఒక్కటే- 'అదర్ టంగ్' (పరభాష)ను నేర్చుకునే ముందు ప్రతిఒక్కరూ మదర్ టంగ్ (మాతృభాష)ను నేర్చుకోవడం తప్పనిసరి!

## తీరు మారాలి

నాణ్యతతో నిమిత్తం లేకుండా ఇంగ్లిష్ మాధ్యమ పాఠశాలలకు తల్లిదండ్రులు ప్రాధాన్యం ఇస్తుండటంతో ప్రభుత్వ పాఠశాలల్లో నమోదు గణనీయంగా పడిపోతోంది. ఈ సమస్యనుంచి గట్టెక్కడానికి ప్రభుత్వ బడుల్లో కూడా ఇంగ్లిష్ మాధ్యమాన్ని ప్రవేశపెట్టాలనే నిర్ణయంవైపు ప్రభుత్వాలు మొగ్గుచూపడం ప్రారంభించాయి. అయితే ఇంగ్లిష్ మాధ్యమంలో విద్యార్థులకు న్యాయం చేయగల ఉపాధ్యాయులుగాని, తగినంతమంది సుశిక్షితులైన ఇంగ్లిష్ ఉపాధ్యాయులను అందించగల వనరులుగాని మనకు అందుబాటులో లేని వాస్తవాన్ని ఇక్కడ మరవకూడదు. శిక్షణ, నాణ్యత లేకుండా ప్రభుత్వం పాఠశాలల్లో ఇంగ్లిష్ మాధ్యమాన్ని ప్రవేశపెట్టడం సత్ఫలితాలు ఇవ్వని ప్రయోగంగా మిగిలిపోయే ప్రమాదం ఉందనీ సంబంధిత అధికారులు ప్రత్యేకంగా గుర్తించాలి. నాణ్యత, వసతుల భాండాగారాలని ప్రకటనలు ఊదరగొట్టే ప్రైవేటు ఇంగ్లిష్ మాధ్యమ పాఠశాలలే విద్యార్థులకు బోధనపరమైన న్యాయం చేయలేకపోతున్నాయి. అలాంటప్పుడు వసతులలేమితో సతమతమవుతున్న ప్రభుత్వ పాఠశాలల్లో శిక్షణ, బోధన, పాలనకు సంబంధించిన కార్యాచరణ సంసిద్ధత లేకుండా రంగంలోకి దిగడం ఆమోద యోగ్యం కాదు. ఈ పరిస్థితుల్లో ప్రాథమిక స్థాయిలో అన్ని ప్రభుత్వ, ప్రైవేటు పాఠశాలల్లో దేశమంతటా మాతృభాషలోనే బోధనాభ్యసన ప్రక్రియను నిర్బంధం చేస్తూ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చర్యలు తీసుకోవాలి. అత్యధిక ప్రజలు కోరుతున్నారని భావిస్తే ప్రారంభంనుంచే ఇంగ్లిష్‌ను ఒక పాఠ్యాంశంగా ప్రవేశపెట్టవచ్చు. ప్రాథమిక దశ తరవాతా ఇదే పద్ధతి కొనసాగించవచ్చు. లేదా మాతృభాషతోపాటు ఇంగ్లిష్ మాధ్యమాన్నీ ప్రవేశపెట్టిన ప్రాథమికోన్నత స్థాయి నుంచి మాధ్యమం ఎంపిక స్వేచ్ఛను విద్యార్థులు, తల్లిదండ్రులకు వదిలేయవచ్చు. ఇందువల్ల విద్యార్థులకు ప్రాథమిక విద్య పటిష్ఠంగా, శాస్త్రీయంగా అందుతుంది. తదనంతరం నిర్ణయ స్వేచ్ఛను వారికే కట్టబెట్టడం వీలవుతుంది. జాతీయస్థాయిలో మాతృభాషలోనే ప్రాథమిక తరగతుల విద్యాబోధన, కింద తరగతులనుంచే ఇంగ్లిష్‌ను ప్రవేశపెట్టే విషయంలో విధాన నిర్ణయం తీసుకోవాలని తెలంగాణ ప్రభుత్వం కేంద్రానికి ప్రతిపాదన సైతం సమర్పించింది. విశ్లేషణాత్మకంగా పరికిస్తే విద్యాగంధానికి నోచుకోని జీవితాలు అజ్ఞానాంధకారంలో పుట్టి, అందులోనే కొనసాగుతాయి. చివరకు అదే అంధకారంలో అంతరిస్తాయి. మానవ మేధ అజ్ఞానాన్ని సమూలంగా తుడిచిపెట్టి విజ్ఞానసంపదను సొంతం చేసుకునేంత శక్తిమంతమైంది. మానవులను మహనీయులుగా తీర్చిదిద్దే విద్య- కళాత్మకమైన పనిముట్టు. పరాయిభాషతో దాని పనితనానికి అవరోధాలు కల్పించకుండా మాతృభాషతోనే దానికి మరింత సానపెడితే- స్వచ్ఛ భారత బిడ్డలు వికాస భారత పౌరులుగానూ శాశ్వత కీర్తి సముపార్జిస్తారు.

(రచయిత- కౌన్సెలింగ్ సైకాలజిస్ట్, ఫ్యామిలీ థెరపిస్ట్)

సౌజన్యం

ఈనాడు

# నల్లగొండ కలెక్టర్‌గా నా అనుభవాలు

ఈ పుస్తకంలో చాలాసార్లు బడుల్లోని ఇంగ్లీష్ డిపార్టుమెంటుల్ని శక్తివంతం చేస్తే అద్భుతమైన సత్ఫలితాల్ని పిల్లల్లో చూడగలం అని పదే పదే చెప్పాను. నేను నమ్మిన ఈ సత్యాన్ని పరీక్షించుకోవటానికి పరమేశ్వరుడు నాకు అవకాశం ఇచ్చాడు. నేను చేసిన ప్రయోగం ఏమిటో దాని ఫలితాలేమిటో ఒకసారి మీతో కూడా పంచుకుంటాను.

నేను నల్గొండ జిల్లా కలెక్టరుగా ఉన్నప్పుడు చేసిన రెండు ప్రయత్నాల్ని వివరిస్తాను. నేను యాదృచ్ఛికంగా పాల్గొన్న ఒక అధ్యాపకుల సమావేశంలో డా॥ నాగేశ్వరరావు అనే జూనియర్ కాలేజి ప్రిన్సిపల్ పాల్గొన్నారు. ఆయన ఇంగ్లీషు మాట్లాడడంలోని మెళకువల గురించి వివరిస్తున్నారు. దాంట్లో భాగంగా ఆయన ప్రతి శుక్రవారం కాలేజీలో

ఉన్న విద్యార్థులందరికీ ఇంగ్లీషు పేపరు కొనిస్తాడు. దాన్ని చదువుతూ ఒక్కొక్క పదాన్ని ఎలా మార్చుకోవచ్చో నేర్పిస్తాడు.

ఉదాహరణకి

“Nation”... Noun -

“National”... adj -

“Nationalise”... verb -

“Nationalisation” ... again noun... ఇలా పిల్లలతో ఇంగ్లీషు మాటలతో ఆటలాడిస్తాడు. చదివిస్తాడు. ఈ ప్రక్రియ నన్ను చాలా ఆకట్టుకుంది. వారిని నా బంగళాకి ఆహ్వానించి వారితో కూర్చుని ఇంగ్లీషు బోధనలో మెళకువల గురించి విస్తృతంగా చర్చించాము. దాంట్లో నిగ్గు తేలిన అంశాలేమిటంటే -

1. ప్రపంచీకరణ నేపథ్యంలో ఇంగ్లీషు నేర్చుకోవడం అవసరం.
2. ఇంగ్లీషు నేర్చుకోవడానికి ఇంగ్లీషు మాధ్యమం సరైన మార్గం కాదు.
3. అది తప్పు విపరీత ఫలితాలకి కూడా దారి తీయవచ్చు.
4. దాన్ని సరిచేయాలంటే ప్రభుత్వ బడుల్లోని ఇంగ్లీషు డిపార్టుమెంట్స్‌ని బలోపేతం చేయాలి.
5. ఉపాధ్యాయులు ప్రేరణ పొందాలి, నైపుణ్యాల్లో శిక్షణ తప్పకుండా తీసుకోవాలి. దానికోసమని ఒక ప్రత్యేకమైన 12 మాడ్యూల్స్‌తో కూడిన ఒక శిక్షణా కార్యక్రమం ఏర్పాటు చేశాం.

దాంట్లో వచ్చిన అంశాలు కొన్ని గద్య లక్షణాలు ఏమిటి? ఎలా నేర్పాం? పద్య లక్షణాలు ఏమిటి? అనుభూతి చెందుతూ ఎలా నేర్పాలి? ఎలా బోధించాలి?

భాష అనే యంత్రాంగం ఎలా పని చేస్తుందో గ్రామర్‌లో చెప్పాలి. కొత్త పదాలు నేర్చుకోవడం, పదసంపద పెంచుకోవడంకోసం, ఉపవాచకం ఎలా చదవాలో చెప్పాలి. పిల్లలకి స్నేహపూరితంగా పాఠం చెప్పేందుకు బోధనా ఉపకరణాలు ఎలా తయారుచేసుకోవాలి? జీవన నైపుణ్య విలువలకి ఇంగ్లీషు బోధనలో ప్రత్యేక స్థానం ఎలా ఇవ్వాలి?

ఇన్ని అంశాలతో 3 రోజులు జరిగిన (వివిధ కేంద్రాల్లో) జరిగిన శిక్షణా కార్యక్రమాలని మొత్తం మీద 750 మంది ఇంగ్లీషు ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

ఒక్కరు అంటే ఒక్కరు కూడా ఒక్క రోజు కూడా ఆబ్సెంట్ కాలేదు. టీ.ఏ,డీ.ఏ ల ప్రస్తావనే లేదు. ఎగవేత పర్మిషన్లు అసలే లేవు. విచిత్రం ఏమిటంటే కవర్ చేయటానికి వచ్చిన మీడియా మిత్రులు సైతం అక్కడే ఉండి భాగస్వాములయ్యారు.

ఆ తరువాత జరిగిన మార్పు పాఠశాలల్లో ఇంగ్లీషు క్లాసుని ఇంగ్లీషులోనే బోధించడం, నా కళ్లారా చూశాను. పిల్లలు ఉత్సాహభరితంగా పాల్గొనడం మరింత ముచ్చటేసింది. ఇంగ్లీషు తరగతుల నిర్వహణలో ఒక బలమైన ముద్ర ఇప్పటికీ కొనసాగుతుందని ఎప్పుడన్నా విన్నప్పుడు చాలా గర్వంగాను, ఆనందంగాను ఉంటుంది.

నల్గొండలోనే జరిపిన ఇంకో ప్రయోగం డా॥ సి.వి. ఆనందన్, రిటైర్డ్ ప్రొఫెసర్ ఇఫ్లూ, డైట్ లెక్చరర్ డా॥ మంగారెడ్డిల సహకారంతో చేశాను.

దాంట్లో డా॥ సి.వి. ఆనందన్ నా ముందుంచిన ఛాలెంజస్-

పిల్లల తల్లిదండ్రులు నిరక్షరాస్యులైనా ఫర్వాలేదు.

1 నుండి 5 లోపు పిల్లలకు డిస్కోర్స్ మెథడ్‌లో ఇంగ్లీషును బోధించవచ్చు. శిక్షణ కార్యక్రమంలో పాల్గొనే ఉపాధ్యాయులు సంతోషంగా, ఇష్టంగా పాల్గొంటే చాలు. విద్యార్హతలు, ప్రతిభతో పెద్దగా పనిలేదు. నేర్చుకోవాలన్న ఆసక్తి అసలు విషయం.

దీనికోసం జిల్లాలో నార్కెట్‌పల్లి మండలాన్ని నమూనాగా ఎంపిక చేసుకున్నాం. ఉపాధ్యాయులకు డిస్కోర్స్ మెథడాలజీలో శిక్షణ ఇచ్చాము.

డిస్కోర్స్ మెథడ్ గురించి కొంచెం ప్రస్తావిస్తాను. ఏ భాషైనా అనేక పద్ధతుల్లో వ్యక్తం అవుతూ ఉంటుంది.

ఉదాహరణకు- ఒక అంశం మీద ఒకళ్ళు వ్యాసంగా రాస్తే, ఇంకొకళ్ళు కథగా చెప్పవచ్చు. ఇంకొకరు కారికేచర్ చేయవచ్చు. ఇలా చేసే ప్రతిదాన్ని ఒక డిస్కోర్స్‌గా భావిస్తారు.

ఇంగ్లీషు భాష నేర్పేటప్పుడు డిస్కోర్సెస్ వాడడం వలన ప్రతి పిల్లవాడు అనేక రూపాల్లో భాషని డిస్కోర్స్ రూపంలో వ్యక్తపరచడానికి ప్రయత్నిస్తాడు. కేరళలో మలయాళం మీడియం పాఠశాలల్లో దానిని చాలా విజయవంతంగా నడిపిన తరువాత దేశ స్థాయిలోనే ఒక మంచి నమూనాగా వచ్చింది అవిభక్త ఆంధ్రప్రదేశ్ నల్గొండ జిల్లాలోనే.

దానిని పరిశీలించటానికి SCERT, ఇతర విద్యావేత్తల్ని ఆహ్వానించి టీచర్లు, మేము పక్కకి తప్పుకొని పిల్లలచేతే పూర్తిగా కార్యక్రమాన్ని నిర్వహింపచేశాము.

ఆ తరువాత ఇది నల్గొండ జిల్లాలో కొన్ని మండలాల్లో కొనసాగినట్లుగా తెలుస్తుంది.

ఈ రెండు ప్రయోగాలు నాకు మంచి స్ఫూర్తిని, ధైర్యాన్ని ఇవ్వడమే కాక నేను మరిన్ని మంచి కార్యక్రమాలు రూపకల్పన చేయడానికి ఆధారమయ్యాయి.

**పై రెండు ప్రయోగాలనుండి నేను చెప్పదల్చుకున్న అంశాలు:**

1. మన యంత్రాంగంలో ఉన్న ఉపాధ్యాయుల శక్తి సామర్థ్యాల మీద నమ్మకం ఉంచాలి.

2. వాళ్ళల్లో ప్రేరణ కల్గించటానికి ప్రత్యేకమైన స్ఫూర్తిదాయకమైన వాతావరణాన్ని నిర్మించాలి.

3. వాళ్ళు చేయబోయే పనిలో రాబోయే మార్పుని వాళ్ళు విజువలైజ్ చేయగలగాలి.

4. శిక్షణా కార్యక్రమాన్ని చాలా చైతన్యదాయకంగా నడిపించాలి.

5. ఇవన్నీ ఒనగూడితే తరగతి గదిలో మార్పు తీసుకురావడం పెద్ద కష్టమేమీ కాదు.

మొత్తం మీద ప్రపంచంలో ఇప్పటి వరకూ వచ్చిన విద్యావేత్తలు అందరూ ఏకకంఠంతో చెప్పే మాట ఏమిటంటే నేర్చుకునే విషయంలో పిల్లలకి పరిమితులు ఉండవు. ఎన్ని భాషలైనా నేర్చుకోగలరు. ఎన్ని విషయాలైనా నేర్చుకోగలరు. ఐతే ఏ పిల్లవాడైనా స్వేచ్ఛగా, స్వచ్ఛంగా నేర్చుకోవాలంటే అందుకు అవసరమైన వాతావరణాన్ని మనం నిర్మించాలి. తనదికాని భాషాపరమైన అవరోధం ఎవరికైనా అవరోధమే. పిల్లలకి మరీ అవరోధం. భాషా సాహిత్యాలు నేర్పేటప్పుడు టీచరు పిల్లలతో ఆత్మీయంగా ఉండాలి. ఇవి రెండూ సాధ్యమైతే ఇంగ్లీషు నేర్చుకోవడం అనేది గొప్ప విషయమేమీ కాదు.

అంతే కాకుండా, మీరు మీ పిల్లల్ని ఇంగ్లీషు మీడియంలో చదివించడం లేదా అన్నీ మనల్ని అడగటం సమంజసం కాదు. ఉదా:- మనం ఒక విషయంలో అత్యంత ప్రమాణాన్ని కోరుకుంటున్నాం. కానీ దేన్ని కోరుకుంటున్నాం.

దాదాపు వంద సంవత్సరాల క్రితం మహానుభావుడు గురజాడ అప్పారావు గారు 'దేశమును ప్రేమించుమన్నా' అన్న ఒక అద్భుతమైన గీతాన్ని రాశాడు. ఆ గీతం ప్రత్యేకత ఏమిటంటే ఆ గీతాన్ని ఏ దేశస్థుడైనా పాడుకోవచ్చు. నిజానికి ఏ దేశపు పౌరుడైనా కలలుగనే దేశం అదే అవుతుంది. అందుకనే దీన్ని 'అంతర్జాతీయ జాతీయ గీతం' అని విమర్శకులు పేర్కొంటూ ఉంటారు. ఆ పాటలో ఒక ప్రధానమైన అంశం ఏమిటంటే దేశాన్ని నిర్ణయించేది భౌగోళికమైన హద్దులు కాదు, దేశం అంటే ప్రజలు అని చెప్పాడు. 'దేశం అంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్' అని చెప్పడంలో దేశాన్ని నిర్మించేది, దేశంయొక్క ప్రతిభని చాటేది, చేవని చాటేది ప్రజలు. ప్రజలు బాగుంటేనే దేశం బాగుంటుంది. ఆ దేశంలో దేశమును ప్రేమించుమన్నా అన్న మాటకి అర్థం ఏమిటంటే దేశము = మనుషులు అన్న ఆయన నిర్వచనం తీసుకొన్నట్లైతే దేశంలోని

**మనుషుల్ని ప్రేమించమని, దేశీయుల్ని ప్రేమించమని, దేశీయుల్ని ప్రేమించడం అంటే వాళ్ళని వాళ్ళుగా ప్రేమించడం, వాళ్ళని మట్టి వాసనతో ప్రేమించడం, వాళ్ళు మాట్లాడే మాటకు మాన్యత ఇవ్వటం, వాళ్ళ భాషకు మాన్యత ఇవ్వడం, వాళ్ళ ఆలోచనకు మాన్యత ఇవ్వటం, వాళ్ళ జీవన విధానానికి మాన్యత ఇవ్వడం, వాళ్ళ కట్టు, బొట్టు, జుట్టు అన్నింటికీ మాన్యత ఇవ్వటం.**

ముఖ్యంగా ఏ దేశమైనా బాగుండాలి అంటే ఆ దేశ ప్రజలకి స్వస్థాన వేష భాషల మీద అభిమానం ఉండాలి.

ఉదాహరణకి చైనా వాళ్ళు ఎక్కడికి, ఏ ప్రాంతానికి వెళ్ళినప్పటికి కూడా లేదా ఏ ప్రాంతంవారైనా చైనాని సందర్శించటానికి వెళ్ళినట్లైతే చైనీయులు వారి జాతీయ లక్షణాలని, వాళ్ళ జాతీయ ప్రాధాన్యత గల అంశాల్ని ఉన్నతోన్నతంగా ప్రదర్శించుకుంటారు. ఇతరులకోసం ప్రదర్శించడమే కాకుండా, వారికి వాళ్ళ భాషన్నా, వాళ్ళ నేలన్నా, వాళ్ళ విజయాలన్నా, వాళ్ళ మనుషులన్నా, వాళ్ళ యువకులన్నా, వాళ్ళ సంస్కృతి అన్నా అన్నింటిపైనా వారికి వల్లమాలిన అభిమానం ఉంటుంది. మనకి పై విషయాల్లో అంత అభిమానం ఉంది అని నేను అనుకోవట్లేదు.

మనం, మన దేశం, భాష, కట్టు, బొట్టు, జుట్టు, సంస్కృతి, అన్నీ మనం చూస్తూ ఉండగానే 60, 70 ఏళ్ళ లోపల తెలుగు జాతి ఒక జాతిగా, అస్తిత్వాన్ని, వ్యక్తిత్వాన్ని కోల్పోతున్న వైనాన్ని మనం చూస్తూ ఉన్నాం. దీన్ని ఎవరు దేశభక్తి స్వస్థాన వేష, భాషాభిమానాలుగురించి మాట్లాడుతున్నారో, వాళ్ళందరూ కూడా ఎవరు దేశభక్తిని ప్రధానమైన ఎజెండాగా ప్రజల మధ్యకి వెళుతున్నారో వారందరూ జాతీయశక్తులు అన్ని కూడా సంస్కృతి, సంప్రదాయాల పరిరక్షణకి, పరంపరని వారసత్వాన్ని మోసుకెళ్ళే భాష కళ్ళ ముందే కనుమరుగవడం చూస్తూ ఊరుకోవడం మంచిది కాదు. జాతీయ శక్తులన్నీ ఏకమై ఇలాంటి విషయాలపట్ల శాస్త్రీయంగా, ప్రజాస్వామికంగా దీన్నిగురించి చర్చించాలి. వైఖరిలో మార్పు తీసుకురావాల్సిన అవసరం ఉంది.

భాషని నేర్చుకోవడం అనేది ఒక ప్రక్రియ - నేర్చుకునే ప్రక్రియ దీనిని నేర్పేందుకు శాస్త్రీయంగా రూపొందించిన విధివిధానాలు ఉన్నాయి. వాటిని వదిలిపెట్టి ఇంగ్లీషు మీడియం ద్వారా ఇంగ్లీషు యోగం పడుతుంది అనుకోవడం ఒక అశాస్త్రీయమైన భ్రమ.

* రాజ్యాంగంకానీ, వివిధ కమిషన్లు, విద్యావేత్తలు, మనస్తత్వ శాస్త్రవేత్తలు, మాతృ భాషల విషయంలో చాలా స్పష్టంగా ఆవిష్కరించిన సత్యాన్ని చూడటానికి మనం ఎందుకు నిరాకరిస్తున్నాం.
* మాతృ భాషలో బోధన, పాలన, భాషను ఎలా జీవవంతంగా కళకళలాడేటట్లు చేస్తాయి.
* పర్యావరణాల పరిరక్షణ ఉద్యమాలు ఉవ్వెత్తున లేచే ఈ కాలంలో భాషావరణం కూడా పర్యావరణమే కదా.
* పరభాష మనని మన ఆలోచనల్లోంచి సహజత్వాన్ని మన సంప్రదాయం పట్ల విముఖతని ఎలా దూరం చేస్తుంది.
* మనం చూస్తుండగానే ఇలాంటి నిర్లక్ష్యానికి గురై కొన్ని మాతృ భాషలు తెరమరుగవుతున్నాయి అనేది నిజమే కదా.
* ఇంగ్లీష్ మీద ఒక్కసారిగా తల్లిదండ్రులు ఎగబడటానికి మనం రూపొందించే విధానాలు, వాటిని నడిపిస్తున్న, ఇతరేతర శక్తుల ప్రభావం లేదా?
* ఈ పరిస్థితిని చక్కదిద్దడానికి దేశీయ భాషా అనుకూల వైఖరితో ప్రభుత్వాలు ఉద్యోగ ఉపాధి రంగాల్ని మార్చుకోవడం నిజంగానే కష్టసాధ్యమా?
* మన వైఖరి "ఆకలి వెయ్యకుండా మందిస్తాను. అన్నం పెట్టు తల్లీ"! అన్న పాత సామెత నిరూపిస్తున్నట్టుగా లేదా?
* ఇలాంటి అంశాలలో ఈ పుస్తకం మీతో మాట్లాడుతూ, మీతో కలిసి నడుస్తుంది. మీ చేతులారా స్వీకరించండి.

అప్యంగా అమ్మ భాషని ఆదరించండి.

# రాజ్యాంగం సైతం ... మాతృభాష కోసం

ఈ సంవత్సరం (2019) నవంబరు 26వ తారీఖున ఒక సువర్ణాధ్యాయంలాంటి ఘట్టం జరుపుకొంటన్నాము. మనల్ని మనం ఎలా పరిపాలించుకోవాలి? అన్న దానిని నిర్ణయించుకొనటానికి రాజ్యాంగం ఏర్పడి 70 సంవత్సరాలు గడచిన సందర్భాన్ని పురస్కరించుకొని ప్రత్యేక దినంగా జరుపుకుంటున్నాము. 1949 నవంబరు 26 న భారత ప్రజలమైన మన అందరం మనకోసం నిర్మించుకున్న మన రాజ్యాంగం మన కలలు, మన ఆకాంక్షలు, మన ఆదర్శాలు, మన స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి ఆకాంక్షలు అన్నింటితో రాజ్యాంగము మనముందుకు వచ్చింది.

ఈ రాజ్యాంగంలో పొందుపరచబడినటువంటి ఒక ప్రధానమైన అంశాన్ని ప్రస్తావించాలి. మాతృభాష విషయంలో కూడా రాజ్యాంగం రెండు ప్రధానమైన అంశాలు గురించి చెప్పింది.

**1.** Sec. 21 (A) విద్యా హక్కుని భారత దేశంలో రాబోయే తరాల్లో పుట్టి పెరిగే ప్రతి పిల్లవాడు, ప్రతి ఆడపిల్ల తప్పకుండా చదువుకొని తీరాలి. అందరికీ ఉచిత విద్యను అందించడానికి తప్పనిసరిగా చర్యలు తీసుకోవాలి అని పేర్కొంది.

**2.** Amtice 350 (A) ప్రకారం భారత దేశంలో ప్రాంతీయ భాషల్లోనే, ముఖ్యంగా స్థానిక భాషల్లోనే విద్యా బోధన జరగాలి అని పేర్కొంది. విద్యని ప్రాథమిక హక్కుగా భావిస్తూ ఏర్పడిన ఆర్టికల్ **21**(ఎ) ఆధారంగా విద్యా హక్కు చట్టం ఒక చట్టంగా రూపొందింది. ఆ చట్టంలో చాలా ముఖ్యమైన విషయం ఒక్కటి చెప్పుకుదాం భారత దేశంలో పాఠ్యప్రణాళిక, ప్రాథమిక విద్య ఎలా ఉండాలి అన్నదాని గురించి చెప్తున్నటువంటి **5** వ చాప్టర్లో చాలా స్పష్టంగా పిల్లలకు అనుకూలమైన మాతృభాషలోనే విద్యాబోధన ఉండాలి అన్నారు. అంతే కాకుండా ఆ నిబంధన చుట్టూతా ఉన్నటువంటి అన్ని సబ్ సెక్షన్లు కూడా ఏం చెబుతాయి అంటే,

పాఠ్య ప్రణాళిక, ప్రాథమిక విద్యను పూర్తి చెయ్యటం.

**1)** సంబంధిత ప్రభుత్వ ప్రకటన ద్వారా అధీకృతం చేసిన అకడమిక్ సంస్థ (SCERT) ప్రాథమిక విద్యకు పాఠ్య ప్రణాళిక, మూల్యాంకన విధానాన్ని నిర్ధారిస్తుంది.

**2)** సబ్ సెక్షన్ **(1)** ప్రకారం పాఠ్య ప్రణాళికను, మూల్యాంకన విధానాన్ని నిర్ధారించేటప్పుడు, అధీకృత అకడమిక్ సంస్థ ఈ క్రింది అంశాలను పరిగణనలోకి తీసుకుంటుంది.

ఎ) రాజ్యాంగంలో పొందుపరచిన విలువలకు అనుగుణంగా ఉండాలి. (Liberty, equality, integrity, transpect)

బి) బాలల సర్వతోముఖాభివృద్ధి జరగాలి.

సి) బాలల జ్ఞానం, సామర్థ్యాలు, నైపుణ్యాలను పెంపొందించాలి.

డి) బాలల పూర్తి సామర్థ్యం మేరకు శారీరక, మానసిక శక్తులు అభివృద్ధి చెందాలి.

ఇ) పిల్లలను కేంద్రంగా చేసుకుని వారికి అనువైన విధానాల్లో కార్యక్రమాలు, పరిశోధన, కనుగొనటం ద్వారా నేర్చుకోవాలి.

ఎఫ్) ఆచరణకు సాధ్యమైనంతవరకు బోధనా మాధ్యమం బాలల మాతృ భాషగా ఉంటుంది.

జి) భయం, ఆందోళనవంటి వాటినుంచి బాలలను విముక్తం చేసి వారు తమ భావాలను స్వేచ్ఛగా వ్యక్తీకరించటంలో సహాయపడాలి.

హెచ్) జ్ఞానాన్ని బాలలు అర్థం చేసుకున్న విధానం, దానిని అన్వయించే సామర్థ్యాలపై నిరంతర, సమగ్ర మూల్యాంకన.

తరువాత ఒకసారి మనము వెనక్కి తిరిగి రాజ్యాంగంవైపు చూసినట్లు అయితే మనకి పిల్లలకు తెలిసిన దేశ భాషలు, స్థానిక భాషల్లోనే చదువు చెప్పాలి అని ఉన్నప్పుడు నాకు తోచినది నేను చెబుతాను, ఉపాధి కల్పిస్తుంది కాబట్టి చెబుతాను అంటే రాజ్యాంగ విరుద్ధము, చట్ట విరుద్ధము కూడా అవుతుంది. షేక్స్పియర్ అన్నట్టు Lawless are they that make their wills their Law అన్నమాట గుర్తుకు రావడం లేదూ!

ఇప్పుడు ఇంతకుముందు చర్చించినట్లు మనది రాజ్యాంగబద్ధంగా నడుస్తున్న వ్యవస్థ, చట్టబద్ధంగా నడుస్తున్న వ్యవస్థ. మన రాజ్యాంగంలో పేర్కొన్నట్లు లేదా చట్టంలో పేర్కొన్నట్లు మాతృభాషలోనే విద్యావిధానం నడవాలి అని స్పష్టంగా ఉన్నప్పుడు వ్యతిరేకంగా ఆలోచించడము అనేది అశాస్త్రీయమే కాకుండా చట్టవిరుద్ధము కూడా అవుతుంది అనేది ప్రధాన అంశము.

ఈ సందర్భంలో ప్రైవేటు పాఠశాలల్లో నడుస్తున్న ఇంగ్లీషు మీడియం గురించి కూడా చెప్పాల్సిన అవసరం ఉంది. ప్రైవేటు పాఠశాలల్లో జరుగుతున్న ఇంగ్లీషు మీడియం కూడా విద్యావ్యవస్థలో భాగాలు, మన విద్యావ్యవస్థ వివక్షాకృత విద్యావ్యవస్థ. అంటే (ఆర్గనైజ్డ్ సెక్టార్ ఆఫ్ ఎడ్యుకేషన్) ఉదాహరణకి పూర్వ కాలంలో వ్యవస్థీకృతమైన విద్యావిధానం ఉండేది కాదు. వీధి బళ్ళల్లో, గుడి మండపాలలో అప్పటికప్పుడు ఆ గురువుగారికి తోచిన కనీస విషయాలు, వ్రాయటం, చదవడం, లెక్క గట్టడం వంటివి నేర్పేవాళ్ళు. వాటిని RRR లేదా 3R, R3 అనేవాళ్ళు. అలాంటివి ఉండేవి. ఇప్పుడు మనం నిర్వహిస్తున్నవి వ్యవస్థీకృత విద్యావిధానము అంటాము.

వ్యవస్థీకృత విద్యావిధానం అంటే దానికి ఒక నిర్దిష్టమైన ప్రణాళిక, శాస్త్రీయమైన బోధనాంశాలు, చట్టపరంగా ఏర్పరచబడి ఉంటాయి. ఇవి ఉన్నచోట ప్రైవేటు రంగంలో మనం గుర్తింపు ఇస్తున్నచోట. ఇంత రుసుము

వసూలు చేయకూడదు లేదా ఇంతకు మించి వసూలు చేయకూడదు, ఇన్ని రోజులు పని దినాలు, ఇన్ని రోజులు శెలవు దినాలు వంటివి నిర్దుష్టంగా ఉంటాయి. అన్ని విషయాల్లో మనం చట్టాన్ని పాటిస్తున్నప్పుడు ఇంగ్లీషు మీడియం విషయంలో వాళ్ళు కూడా తప్పకుండా పాటించాలి అని చెప్పాలి. తెలుగు మీడియంలోనే జరిగేటట్లు చూస్తే, మనకి తప్పకుండా మంచి పరిష్కారం దొరుకుతుంది. దానితోపాటు మీడియంను కూడా నియంత్రణ చేయాల్సిన అవసరం ఉంది. చట్టంలో లేనిదానిగురించి ఎవరూ దేబిరించి అడగట్లేదు. చట్టంలో ఉన్నదాన్ని అమలు చేయాల్సిన అవసరం ఉంది. అది ప్రైవేటు విద్యా రంగం అయినప్పటికీ చట్ట పరిధిలోకే వస్తుంది. చట్ట ప్రకారమే పరీక్షలు, మూల్యాంకనము కూడా జరుగుతాయి. చట్ట ప్రకారమే పాఠ్యప్రణాళికలు నిర్మించబడతాయి అన్నప్పుడు మాధ్యమం విషయంలో కూడా చట్ట ప్రకారమే ఆలోచించవలసిన అవసరము ప్రభుత్వాలకు ఉంది కదా!



# తూర్పుకి తిరిగి దండం పెడదాం

మన దేశంతో పోల్చుకోదగిన ప్రాచ్య ప్రపంచానికి సంబంధించినవే కాకుండా ప్రాచీన ప్రపంచానికి సంబంధించిన దేశాలు చైనా, జపాన్‌లు. అ దేశాలో ఉన్న పరిస్థితికి మన దేశంలో ఉన్న పరిస్థితికి చాలా విషయాల్లో పోలికలు ఉన్నాయి. భారత్, చైనా ప్రాచీన దేశాలు, అతిపురాతనమైన సంస్కృతి గల దేశాలు. అలాగే జపాన్‌తో పోల్చుకున్నప్పుడు కూడా సంస్కృతి పరమైన చాలా సాదృశ్యాలు ఉంటాయి. ఇలాంటి ఈ మూడు దేశాల్లో జరుగుతున్న తీరు చూస్తుంటే, ఈ మూడు దేశాలు కూడా ముఖ్యంగా చైనా, భారత దేశాలు ఒకప్పుడు విదేశీదాడులు, దండయాత్రలకి లోనయ్యాయి. స్వతంత్రం కోల్పోవడము జరిగింది. కష్టాన్ని దుఃఖాన్ని అనుభవించటం జరిగింది. కానీ ఈ దేశాలన్నీ స్వతంత్రం పొందిన తరువాత స్వతంత్రంగా ఆలోచించడం మొదలు పెట్టిన తరువాతే పురోగతి సాధించారు.

ప్రజలకు అర్థంకాని, ప్రజలకు తెలీని, ప్రజలకు పొంతనలేని పరిపాలన ఉండకూడదు. ప్రజలకు అందని విద్య ఉండకూడదు. విజ్ఞాన ఫలాలు ప్రజలందరికీ అందాలి, ఆ పురోగతి ప్రజలందరికీ అందాలి. ప్రజలందరూ

భాగస్వాములు కావాలి అంటే భాషలతోనే సాధ్యం అవుతుంది కానీ వేరే విధంగా కుదరదు. చైనా ఏ కార్యక్రమం చేపట్టినా బడి ప్రాతిపదికగానే చేబడతారు. వాళ్ళు స్కూళ్ళల్లోనే ఊరికి సంబంధించిన ప్రధాన సమావేశాలు ఏర్పాటు చేస్తారు. రేషన్‌వంటివి కూడా అక్కడే పంపిణీ చేస్తారు.

ముఖ్యంగా చైనీయులు పాఠశాలల్లో చైనా భాషలోనే విద్య నేర్చుకుంటారు. ఉదాహరణకి మనం అనుకుంటున్న ఆధునిక విద్యలు, వృత్తి విద్యాపరమైనటువంటి బి.టెక్ లాంటి కోర్సులు, డాక్టర్ కోర్సులు వాళ్ళ చైనీస్ భాషలోనే నేర్చుకుంటారు. ఒకవేళ వాళ్ళు విదేశాలకు వెళ్ళవలసి వస్తే లేదా విదేశీ పుస్తకాలు చదవవలసిన అగత్యం ఏర్పడితే అప్పుడు మాత్రమే డిగ్రీ అయిన తరువాత బ్రిడ్జికోర్సు 5 నుండి 6 నెలలపాటు నేర్చుకుంటారు. అదీ ఐచ్ఛికంగానే ఉంటుంది. సబ్జెక్టులో భాగం కాదు. వాళ్ళు చైనా భాషలో నేర్చుకున్నారు కాబట్టి తక్కువ అనో, మిగిలినవారు ఎక్కువనో మనం భావించలేము. ప్రపంచంలో అన్ని మూలలా ఉన్న ఇంజనీర్లతో పోటీపడి పని చేయగలరు. అన్ని రంగాల్లో ముఖ్యంగా ఒలింపిక్స్ దగ్గరనుండి శాస్త్రీయ విద్యలవరకు, సాహిత్యపరమైన వాటిలో కూడా పోటీపడి పనిచేస్తున్నారు. అన్ని రంగాలతో వాళ్ళు వాళ్ళ ఒరవడిలో తీర్చిదిద్దుకుంటారు. ప్రపంచంలో జరిగే ఏ మార్పునైనా గ్రహిస్తారు.

అలాగే జపాన్ దేశంగురించి కూడా ఒక్క చిన్న మాటని మనవి చేస్తాను. జపాన్‌లో ముఖ్యంగా సాఫ్ట్‌వేర్ రంగంలో వాళ్ళు కనుక్కున్నటువంటి అంశాలకి పేటెంట్ కోసం, అంటే పేటెంట్ హక్కుకోసం దరఖాస్తు చేయడానికి, పేటెంట్ పూర్వాపరాలు ప్రాథమికంగా వివరించడానికి, కాపీ రైట్స్ పొందటానికి వాటిని ప్రాథమికంగా ఇంగ్లీషులో తర్జుమా చేయాల్సి వచ్చింది. ఆ తర్జుమాని భారత దేశంలో ఉన్న కొంత మంది సాంకేతిక పరిజ్ఞానం, ఇంగ్లీషు కలిగినవాళ్ళతో కూడిన ఒక 400 మంది ఇంజనీర్లతో చేయించారు. కానీ వాళ్ళు సాధించిన 10, 20 వేల పేటెంట్లు వారికి భారీగా విదేశీ మారకద్రవ్యాన్ని ఆర్జించి పెడుతున్నాయి. ఎంతో అభ్యున్నతిని పొందుతున్నాయి. అన్ని పేటెంట్లు శాస్త్రవేత్తలు సాధించడం గొప్ప. వాటి హక్కులు తెచ్చుకోవడం చాలా చిన్న పని.

ఇది జపాన్ మనకి చెబుతున్న వాస్తవం కూడా. బిటెక్, ఎంటెక్‌లు పూర్తి చేసుకొని ఇతర దేశాలు వెళ్ళవలసి వచ్చినపుడు ఇంగ్లీషుని నేర్చుకోవచ్చు. ఇతర దేశస్థులతో ఇంటరాక్షన్ సందర్భంలో మాత్రమే బ్రిడ్జి కోర్సులు చాలు అని చైనా మనకి చెబుతుంది.

ఇంగ్లీషు వాడు దేశ భాష విషయంలో వ్యవహరించిన తీరు చూసుకుంటే మనం నేర్చుకోదగినటువంటి సంఘటనలు ఉన్నాయి. థామస్ మన్రో మహాశయుడు, ఈ దేశంలో 'దత్తమండలాల కలెక్టర్'గా వ్యవహరించినపుడు మన రాష్ట్రంలోని రాయలసీమ జిల్లాలు మొత్తం ఆయన అధీనంలో ఉండేవి. అలాగే అప్పుడు మద్రాస్ ప్రెసిడెన్సీలో అనేక కీలకమైన బాధ్యతలు నిర్వహించారు. ఆయన ఎక్కడికి వెళితే అక్కడ దేశ ప్రజల స్థానిక భాషల్లోనే, దేశీయ భాషలోనే మాట్లాడేవారు. తమిళ ప్రాంతంలో పర్యటించేటప్పుడు తమిళంలోను, తెలుగు ప్రాంతంలో పర్యటించేటప్పుడు తెలుగులోను, కన్నడ ప్రాంతంలో పర్యటించేటప్పుడు కన్నడంలోను - అలా స్థానిక భాషలన్నింటిలో కూడా మాట్లాడేవాడు.

స్థానిక ప్రజల ఆచార వ్యవహారాలు, సంస్కృతిని తెలుసుకోవటం వారితో మమేకం కావడం వలన ప్రజల హృదయాల్లో ఒక శాశ్వతమైన, సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకున్నాడు థామస్ మన్రో. ఆయన ఒక బ్రిటీషు అధికారి అయినప్పటికీ ఆయన దగ్గరకి అసిస్టెంట్ కలెక్టరుగా వచ్చిన సి.పి. బ్రౌన్‌కి ఒక సలహా అడిగితే ఆయన ఇలా చెబుతారు. "Go to the people, speak to them, learn from them" అంటే శిక్షణా కాలంలో మనం నేర్చుకునే విషయాల కన్నా ప్రజల మధ్య ఉండి, ప్రజలతో కలిసిపోయి, ఒదిగిపోయి నేర్చుకున్న విషయాలే గొప్ప. ప్రజల మాటలు వినటం, ప్రజల మాటలు మాట్లాడడం - ఇవి రెండూ చాలా అవసరము అని చెప్పి దాదాపు నూట ఎనభై సంవత్సరాల క్రిందటే చెప్పి వెళ్ళిన మహానాయకుడు మన్రో.

మనకి ఇంకొక ప్రధానమైన ఘట్టము ఏమిటంటే "South Indian Castes and Tribes" అని మన దక్షిణ భారత దేశంలోని కులాల, జాతులగురించి, వారి ఆచారాలు, జీవన విధానంగురించి చాలా శాస్త్రీయంగా ఆంత్రోపాలాజికల్ మెథడ్‌లో చక్కగా లోకానికి 13 వాల్యూమ్స్ అందించిన థర్‌స్టన్ కూడా ఇంగ్లీషు అధికారే. అలాగే ప్రాంతీయ ప్రజల జీవన విధానాన్ని, ప్రతి ఊరికీ ఉన్న ఆ ఊరి కథని, ఊరి గుడి కథని, చెరువు కథని అన్నింటినీ క్రోడీకరించి, రికార్డు

చేసి మనకి అందించిన మహనీయుడు కల్నల్ మెకంజి. వాటినే 'మెకంజీ కైఫియత్'లు అంటాం. ఇలాంటి ఎంతో మంది ఇంగ్లీషువాళ్ళు దేశ భాషలకోసం, దేశ ప్రజలకోసం పనిచేస్తే, వారు పేరుకి తెల్లవాళ్ళే కాని, మన దేశాన్ని, మన, మట్టినీ, మన ప్రజలనీ ప్రేమించారు అనటానికి అనేక తార్కాణాలున్నాయి. కానీ మనం తెల్లవాడు పోయి, నల్లవాడు వచ్చిన తర్వాత తెల్లవాడిలో ఉన్న నల్లదనం, కనీసం కూడా మనలో లేకపోవడం, డొల్లతనం మాత్రమే పైకి తేలడం చాలా విచారించాల్సిన అంశం అనిపిస్తోంది.

అటు రాజ్యాంగపరంగా కానీ, లేదా ఇటు ఇంగ్లీషువాళ్ళు వదిలివెళ్ళిన మంచి ఉన్నత ప్రమాణాలు కానీ దేనినీ మనం స్వాంతం చేసుకోకుండా మనదంటూ స్వదేశ, వేష భాషలపట్ల అభిమానం లేకుండా మనం ఉంటున్నాము అనేది చాలా దురదృష్టకరమైన అంశము.

ఆగదు ఇంతటితో ఇంగ్లీషు భాషా వ్యామోహం
ఇది మనలోని పసితనాన్ని
మనకు తెలియకుండానే ఎత్తుకెళ్ళిపోతుంది
సృష్టిలో మనమేదో ప్రత్యేకంవంటి భావం
మారాకు తొడుగుతుంది
మనమేదో తెలివిపరులం అని
మనకు మనమే మురిసిపోతాం
ఈ అరువు గొంతు
జీవితానికి అనుబంధం ఇవ్వదు
ఆనందం అనుభూతిగా మారి పులకరించదు
ఆఖరికి మన స్వేచ్ఛ కూడా
పీసీ సర్కార్ ఇంద్రజాలంలో
ఏనుగులాగా
మన కళ్ళ ముందే మాయం అయిపోతుంది.
ఈ ఇంగ్లీష్ నాటకంలో
మనం
ఒట్టి పాత్రధారులమేనా?
ఏమో!
కాలం సముద్రం లాంటిది
ఏదీ కడుపులో దాచుకోదు.

# గ్లోబల్ స్కిల్స్

## విజయానికి వీసా

ప్రజ్ఞమహర్షి



③

# కమ్యూనికేషన్ స్కిల్ అంటే ఏమిటి?

కమ్యూనికేషన్ స్కిల్ అనేది ఆరు రకాల నైపుణ్యాల సమ్మేళనం. అవి: వినడం, చదవడం, మాట్లాడటం, రాయడం, భాష, దేహభాష. విజ్ఞాన-ఆధారిత- ఆర్థిక వ్యవస్థలో ఈ ఆరురకాల నైపుణ్యాలపై పట్టు ఉండటం అవసరం. వాస్తవానికి కమ్యూనికేషన్ స్కిల్ నేర్పడంలో సిద్ధహస్తులమని ప్రకటించేవాళ్లకు కూడా ఈ నైపుణ్యాల మీద అవగాహన ఉండటం లేదు. బాగా మాట్లాడగలిగే వ్యక్తిని 'కమ్యూనికేషన్ స్కిల్‌లో దిట్ట' అనుకోవడం-కేవలం అవగాహనారాహిత్యం. బాగా మాట్లాడటాన్ని స్పోకెన్ స్కిల్ అంటారు. పైన తెలిపిన ఆరు నైపుణ్యాలపై మంచి పట్టు ఉన్నప్పుడు మాత్రమే కమ్యూనికేషన్ స్కిల్‌లో దిట్ట అయినట్టు అర్థం.

ఇంగ్లీషులో బాగా మాట్లాడగలగడాన్నే కమ్యూనికేషన్ స్కిల్ అంటారని భారతదేశంలో చాలామంది భావిస్తుంటారు. ఉన్నత చదువులు చదివినవారు కూడా చాలావరకు ఇదే అపోహలో ఉన్నారు. కమ్యూనికేషన్ స్కిల్ ఒక్క ఆంగ్లభాషకు మాత్రమే పరిమితం కాదు. ఏ భాషలో మంచిగా కమ్యూనికేట్ చేయగలిగినా అది కమ్యూనికేషన్ స్కిల్‌గానే పరిగణించాలి.

మనుషుల మధ్య కమ్యూనికేషన్ రెండు విధాలుగా జరుగుతుంది. ఒకటి స్వీకరించడం ద్వారా (ఇన్‌పుట్), రెండు ఇవ్వడం ద్వారా (ఔట్‌పుట్). స్వీకరించడాన్ని మూడు రకాలుగా చేస్తాం. వినడం ద్వారా, చదవడం ద్వారా, చూడటం ద్వారా. అలాగే యివ్వడాన్ని కూడా మూడు రకాలుగా చేస్తాం. మాట్లాడటం ద్వారా, రాయడం ద్వారా, దేహభాష (నాన్ వెర్బల్) ద్వారా.

సాధారణంగా కమ్యూనికేషన్‌లో సమాచారాన్ని ఇవ్వడం కన్నా తీసుకోవడమే ముఖ్యమైనది.

ఉదాహరణకు మీరు పని చేస్తున్న సంస్థకు సంబంధించిన ఒక కస్టమరుకు ఏదో సమస్య వచ్చింది. ఆ సమస్యను మీరు సరిగ్గా తీర్చాలంటే ముందు మీరు దానిని సరిగ్గా అర్థం చేసుకోవాలి. సరిగ్గా అర్థం చేసుకోవాలంటే సరిగ్గా వినాలి. అలాగే మీరు ఆంగ్లంలో బాగా మాట్లాడాలి అనుకుంటే ముందుగా మీరు ఆంగ్లభాషను బాగా నేర్చుకోవాలి. అంటే బాగా వినాలి, చదవాలి. మీరు ఎంత ఎక్కువ వింటారో చదువుతారో అంత ఎక్కువ నేర్చుకోగలుగుతారు.

'విజ్ఞానమే విజయం' అయిన ప్రస్తుత విజ్ఞాన-ఆధారిత-ఆర్థిక వ్యవస్థలో విజ్ఞాన సముపార్జన చేయాలంటే అది కేవలం బాగా చదవడం, వినడం ద్వారానే సాధ్యం. దురదృష్టవశాత్తూ ఇవాళ ఎవరూ చదవడం లేదు. వినడం లేదు. ప్రస్తుత పరిస్థితుల్లో కమ్యూనికేషన్ స్కిల్ పట్ల శాస్త్రీయ అవగాహనను కలిగించుకోవలసిన అవసరం ఎంతో ఉంది. లేకపోతే అసలు సమస్య పరిష్కారం కాకపోగా కొత్త సమస్యలు తలెత్తే ప్రమాదం ఉంది. ఈ దిశలో కొన్ని వాస్తవాలను తెలుసుకోవడం అవసరం.

* కమ్యూనికేషన్ స్కిల్ ప్రపంచంలో ఉన్న అన్ని భాషలకు వర్తిస్తుంది.

* భాషాశాస్త్రవేత్తల పరిశోధనలో తేలిన విషయం ఏంటంటే ఏ వ్యక్తికి తన మాతృభాష మీద మంచి పట్టు ఉంటుందో ఆ వ్యక్తికి ఇతర భాషల మీద కూడా పట్టు వస్తుంది. ఎందుకంటే ఎవరైనా వేరే భాష నేర్చుకునేటప్పుడు తన మాతృభాషతో అనుసంధానం చేసుకుంటూ పోల్చుకుంటూ నేర్చుకుంటాడు. చిన్నప్పట్నించి ఇంగ్లీషు మీడియంలో చదివినా చాలామంది భారతీయులకు ఇంగ్లీషు సరిగా రాకపోవడానికి కారణం ఇదే. వారికి మాతృభాషలో పట్టులేకపోవడమే.

* ఆసక్తికరంగా మాట్లాడటమే కాదు, ఇతరులు వాళ్లు చెబుతున్న అంశాలను మనం ఏ విధంగా అర్థం చేసుకోవాలని కోరుకుంటారో ఆ విధంగా అర్థం చేసుకోవడం చాలా ముఖ్యం.

* కమ్యూనికేషన్ స్కిల్‌లో దేహభాష (బాడీ లాంగ్వేజ్) ముఖ్యపాత్ర వహిస్తుంది. ముఖకవళికలు, కనుసైగలు, నిలబడే విధానం, ఇతరులను స్పృశించే పద్ధతి, గొంతు, పదాల ఉచ్చారణ, మాటల మధ్య పాటించాల్సిన నిశ్శబ్దం.. ఇవన్నీ దేహభాష కిందకే వస్తాయి.

* భాషా ప్రావీణ్యం కూడా చాలా ముఖ్యమే. విషయానికి అనుగుణంగా పదాలు వాడటం, ఆసక్తిని రేకెత్తించే విధంగా సామెతలు వాడటం, వ్యాకరణ దోషాలు లేకుండా మాట్లాడగలగడం, రాయగలడం ముఖ్యం.

సంస్కృతి, సాహిత్యం, ప్రజల జీవన విధానం, చరిత్రలకు సంబంధం లేకుండా భాషను నేర్చుకుని ఎంత ధారాళంగా మాట్లాడగలిగినా అది జీవం లేని ప్రసంగమే అవుతుంది తప్ప జవసత్వాలు కలిగిన సంభాషణ కాజాలదు. ఈ సంగతి ఆలస్యంగానైనా గ్రహించిన భారతదేశ వ్యాపారరంగ నిపుణులు ఆంగ్లభాషనే సర్వరోగ నివారిణిగా భావించకుండా తమ సిబ్బందికి కమ్యూనికేషన్ స్కిల్స్‌లో శిక్షణ యిచ్చే ఏర్పాటు చేస్తున్నారు.

ఇ-మెయిల్: pragnamaharshi@yahoo.com

☆

ఆదివారం ఆంధ్రజ్యోతి • 22 మే, 2005 • 13

సౌజన్యం

ఆంధ్రజ్యోతి

# మాతృభాషా నిర్లక్ష్యమూ జీవవిధ్వంసమే

> విద్యావిధానంలో మాతృభాషా వ్యవహారానికి అవకాశం లేనప్పుడు భాష, దానితోపాటుగా జాతీ సంస్కృతీ అస్తిత్వాన్ని కోల్పోయి దేశీయ భాషా వ్యవహర జాతులన్నీ త్వరితగతిన అంతరించిపోయే ప్రమాదం ఉంది. ఇది ముమ్మాటికీ జీవవిధ్వంసమే... పరోక్షంగా జీవవిధ్వంసానికి కారణమయ్యే భాషా విధానాల పట్ల న్యాయస్థానాలూ చట్టసభలూ పునరాలోచన చేయాలి. జీవవిధ్వంసాన్ని అరికట్టేందుకు మాతృభాషా మాధ్యమం తప్పనిసరి చేస్తూ రాజ్యాంగ సవరణ చేయాలి.

తెలియని విషయాన్ని తెలియజెప్పేదే విద్య. అది మాతృభాషలో ఉండటమే శాస్త్రీయం. అది పరభాషలో జరగడం తప్పనిసరి అయితే అదే పెద్ద తప్పు. అదే అవిద్య. సామాజిక రుగ్మతలకు విషయం అర్థం కాదు. దానివల్ల మూలమే దెబ్బతింటోంది. ఇదే విద్యారంగంలో వెనుకబాటుతనానికి కారణం. మనకు ఎందుకూ కొరగాని మాధ్యమం ఆంగ్లమాధ్యమమే. అదే సమాజంలో ప్రజలను విభజిస్తోంది. ఇంటిభాష, బడిభాష వేరు కావడంతో భాష వల్లనే సమాజంలో అంతరాలు ఏర్పడుతున్నాయి. ప్రతివాడికీ బతికే హక్కూ, అమ్మ భాషలోనే పనిచేసే హక్కూ పుట్టుకతో సిద్ధించేవే. విద్యావిధానంలో మాతృభాషా వ్యవహారానికి అవకాశం లేనప్పుడు భాష, దానితోపాటుగా జాతీ సంస్కృతీ అస్తిత్వాన్ని కోల్పోయి దేశీయ భాషా వ్యవహార జాతులన్నీ త్వరితగతిన అంతరించిపోయే ప్రమాదం ఉంది. ఇది ముమ్మాటికీ జీవవిధ్వంసమే. అందుకే తెలుగుభాషకు రెండు రాష్ట్రాలూ కలిసి ఒక భాషావిధానం అవసరం.

200 పైగా భాషలున్న భారతదేశంలో అనుసంధాన భాషగా హిందీనీ, అంతర్జాతీయ భాషగా ఆంగ్లాన్నీ వినియోగిస్తున్నారు. నేడు అవసరార్థం ప్రాంతీయ భాషతో పాటు ఇతర భాషలూ నేర్చుకోవాలి. ఒకటికంటే ఎక్కువ భాషలు మాట్లాడే సందర్భాలలోనే సమస్యలు తలెత్తుతాయి. స్వాతంత్ర్యానికి పూర్వం కూడా భాషా సమస్య ఉంది. బోధన మాధ్యమంగా ఆంగ్లం, సంస్కృతం, అరబిక్‌లలో ఏది ఉండాలన్న దానిపై వివాదాలు తలెత్తాయి. చివరకు మెకాలే (1835) ప్రతిపాదనల ద్వారా ఆంగ్లం అధికార భాషగా బోధనా భాషగా స్థిరపడింది. 20వ శతాబ్దిలో ద్విభాషా సూత్రం అమలులో ఉండేది. ఆంగ్లం ప్రథమ భాష. ప్రాంతీయ భాష ద్వితీయ భాష. కానీ ఆంగ్లానికే ప్రాధాన్యం ఉండేది. స్వాతంత్ర్యోద్యమ కాలంలో ప్రజలకూ, నాయకులకూ, ప్రభుత్వానికీ ఆంగ్లం అనుసంధానంగా ఉన్నప్పటికీ ఆ భాష తెలిసినది కొద్దిమందికే. ఏదో ఒక దేశ భాష మాత్రమే అధికార భాషగా ఉండాలనే అభిప్రాయం బలపడింది. అధిక సంఖ్యాకుల మాతృభాష హిందీ కావడంతో హిందీ వెలుగులోనికి వచ్చింది (నిజానికి హిందీ ఒక భాష గాదు). స్వాతంత్ర్యానంతరం హిందీ అధికార భాష అయ్యింది. దేశమంతటా హిందీభాషను అమలు చేయాలనీ పాఠశాలలో తప్పనిసరి చేయాలనీ నిర్ణయించారు. హిందీయేతర ప్రాంతాలలో దీనికి తీవ్ర వ్యతిరేకత వచ్చింది. తమిళనాడులో ఏకంగా హిందీ వ్యతిరేక ఉద్యమాలు చెలరేగాయి. హిందీ భాషా వాదుల బలం ఎక్కువగా ఉన్నప్పటికీ హిందీని ఇతర భాషా రాష్ట్రాలపై రుద్దడానికి కేంద్రప్రభుత్వం ఒప్పుకోలేదు. ఈ పరిస్థితిని సమీక్షించడానికి కేంద్ర ప్రభుత్వం కొఠారి కమిషన్‌ను వేసింది. వారి సిఫార్సుల మేరకు ఏర్పడినదే త్రిభాషా సూత్రం. దీని ప్రకారం: హిందీయేతర రాష్ట్రాలలో పిల్లలు నేర్చుకోవలసిన భాషలు:1. మాతృభాష లేదా ప్రాంతీయ భాష 2. జాతీయ అధికార భాష హిందీ 3. అంతర్జాతీయ భాష ఆంగ్లం. హిందీ మాతృభాషగా గల రాష్ట్రాలలో నేర్చుకోవలసిన భాషలు 1. మాతృభాష లేదా ప్రాంతీయభాష - హిందీ 2. అంతర్జాతీయ భాష-ఆంగ్లం 3. ఒక భారతీయ భాష (దక్షిణ భారత భాషకు ప్రాధాన్యం). 1964లో కొఠారీ కమిషన్ ప్రతి విద్యార్థి ప్రాంతీయ భాషతో పాటు విధిగా హిందీ, ఆంగ్ల భాషలను అభ్యసించాలని ప్రతిపాదించింది. 1978లో ఎన్‌సీఈఆర్‌టీ వారు రూపొందించిన 10+2+3 విద్యాప్రణాళికలో కూడా త్రిభాషా సూత్రాన్ని తప్పనిసరిగా అమలు చేయాలని నిర్ణయించారు. 1986 జాతీయ విద్యావిధానం కూడా త్రిభాషా సూత్రానికి ఆమోదం తెలిపింది.

కారణాలేవైనా రెండు తెలుగు రాష్ట్రాలలోనూ పాలన, బోధనాది రంగాలలో తెలుగు వెనకబడింది. ఆంగ్లేయుల పాలనలో ఆంగ్లం అధికార భాషగా బోధన భాషగా ఉండటంవల్ల దేశ భాషలకంటే అధికంగా అది ప్రాచుర్యం పొందింది. దేశ భాష అయిన తెలుగు వెనకబడింది. ఉపాధి సముపార్జన ఆంగ్ల మాధ్యమంలో చదివిన వారికే పరిమితం. తెలుగు మాధ్యమంలో చదివిన వారికి ఉద్యోగ భద్రత లేదు. దీనివల్ల బోధనలోగానీ పాలనలోగానీ ఆశించినంతగా తెలుగు వ్యవహారంలో లేదు.

దేశంలోని చాలా రాష్ట్రాలలో హిందీని తృతీయభాషగా ప్రవేశపెట్టారు. మన రాష్ట్రంలో వారానికి మూడు గంటలు హిందీకి కేటాయించారు. అంటే కొఠారి కమిషను సూచనల ప్రకారం హిందీయేతర రాష్ట్రాల విద్యా విధానం, భాషావిధానం, ఆచరణలలో భాగంగా త్రిభాషా సూత్రం జాతీయ స్ఫూర్తిని కలిగిస్తుంది. ఇతర ప్రాంతాలతో సంబంధ బాంధవ్యాలు కలిగేలా చేస్తుంది. అనువాదాలను, మాతృభాషా ప్రాధాన్యాన్నీ ప్రోత్సహిస్తుంది. తద్వారా అంతర్జాతీయ అవగాహన కలుగుతుంది. దీనితోపాటు ఉన్నత విద్యాస్థాయిలో కూడా విద్యా బోధన ప్రాంతీయ భాషల్లోనే జరగాలని సిఫారసు చేసిన మొట్టమొదటి నిపుణుల కమిటీ డా. రాధాకృష్ణన్ కమిషన్ (1948). దీనికి మద్దతుగా కాశ్మీర్, నాగాలాండ్‌లలో ఆంగ్లభాషా మాధ్యమం విఫలమయ్యిందని విద్యావేత్త ఎం.వి. రాజగోపాల్ పేర్కొన్నారు. ఇవన్నీ మాతృభాషా మాధ్యమం లేకపోవడం వల్ల కలిగే అనర్థాలు. అందుకే కొఠారి కమిషన్ కూడా మాతృభాషా ప్రాధాన్యాన్ని ఉద్ఘాటిస్తోంది.

త్రిభాషాసూత్రం జాతీయ సమగ్రతనూ, సమైక్యతనూ ప్రోత్సహించడానికి ఉద్దేశించినది. భారతీయ మాతృభాషల అభ్యసనాన్ని ప్రోత్సహిస్తూ నూతన విద్యావిధానంలో భాగంగా భారత ప్రభుత్వం 1964లో జాతీయ విధానాన్ని అమలుచేయడానికి డా. కొఠారీ అధ్యక్షతన ఒక కమిటీ వేసింది. హిందీ వ్యవహృత రాష్ట్రాల్లోని పిల్లలు హిందీ, ఆంగ్లం, మరేదైనా ఒక ప్రాంతీయ భాషను ఎంపిక చేసుకోవాలి. తక్కిన రాష్ట్రాల్లోని పిల్లలు తమ ప్రాంతీయ భాషనూ, హిందీనీ, ఆంగ్ల భాషలను ఎంచుకోవాలి. అయితే ఈ విధానం ఆంధ్రప్రదేశ్, మరికొన్ని రాష్ట్రాల్లో మాత్రమే అమలులో ఉంది. హిందీ వ్యవహృత రాష్ట్రాలలో ఈ విధానం నీరుగారిపోయింది. తమిళనాడులో కూడా దీనిపట్ల తీవ్ర వ్యతిరేకత ఏర్పడడంతో అక్కడా ద్విభాషా విధానాన్నే ఎంచుకోవలసివచ్చింది. ఇలా రాష్ట్రాలలో త్రిభాషా సూత్రం అమలు చేయాలన్న కేంద్రప్రభుత్వ సంకల్పం చాలావరకూ నీరు గారిపోయిందనే చెప్పాలి.

ప్రాథమిక విద్య - I - V తరగతులు : I - II ఒక భాష : మాతృభాష / ప్రాంతీయ భాష. III - V మాతృభాష / ప్రాంతీయ భాష. ప్రాథమికోన్నత విద్య - VI -VIII తరగతులు : VI - VIII మూడు భాషలు : (1) మాతృభాష / ప్రాంతీయ భాష (లేక హిందీ ప్రాంతాలలో హిందీ). (2) ఆధునిక భారతీయ భాష (హిందీయేతర ప్రాంతాలలో హిందీ). (3) అంతర్జాతీయభాష (ఆంగ్లం). సెకండరీ (ఉన్నత పాఠశాల) విద్య - IX, X తరగతులు : IX - X మూడు భాషలు : (1) మాతృభాష / ప్రాంతీయ భాష (లేక హిందీ ప్రాంతాలలో హిందీ). (2) ఆధునిక భారతీయ భాష (హిందీయేతర ప్రాంతాలలో హిందీ). (3) అంతర్జాతీయభాష (ఆంగ్లం). హైయర్ సెకండరీ (రెండవ ఉన్నత పాఠశాల) విద్య XI, XII తరగతులు. XI, XII రెండు భాషలు : 1. మాతృభాష లేదా ప్రాంతీయ భాష 2. ఆంగ్లం.

వీటితోపాటూ సంస్కృతం, చైనీసు, జపనీసు, రష్యను, ఫ్రెంచి, జర్మను, అరబ్బీ, పారశీకం, స్పానిషు మొదలైన భాషలను వివిధ విద్యాస్థాయిలలో అదనపు ఐచ్ఛికాలుగా అందించవచ్చు.

అన్ని దశలలోనూ మాతృభాష మాధ్యమంగా ఉండాలి. మాతృభాష/ప్రాంతీయ భాష ఒకటే అయితే ఆ భాషే, ప్రాథమిక విద్య పూర్తి అయ్యేవరకూ మాధ్యమం. అలా కాకపోతే ప్రాంతీయ భాష మూడవ తరగతి నుంచీ బోధనా మాధ్యమం కావాలి. విద్యాకార్యాచరణ ప్రణాళికలన్నీ చిత్తశుద్ధితో అమలులోకి రావాలి. ఎక్కువ భాషలు నేర్చుకోవడం విద్యార్థికి భారం కాకూడదు. ఆంగ్ల మాధ్యమం ద్వారా చదివితే ఆంగ్లం బాగా వస్తుందనీ ఉద్యోగభద్రత ఉంటుందనీ కొందరు చెప్తుంటారు. కానీ అది అసంబద్ధం. ఈ విధానం జాతీయస్ఫూర్తికీ మానవతావిలువలకూ విరుద్ధం. భారతదేశం లోపలా భారతదేశం బయటా ఉద్యోగాలకోసం భారతీయభాషలను వాడే పద్ధతికి తగిన విద్యావిధానం భారతదేశంలో లేదు. దీనికి చైనా, జపాన్, రష్యా, ఫ్రాన్స్ వంటి ఆంగ్లేతర భాషలు మాట్లాడే దేశాలే తార్కాణాలు. ఉదాహరణకు, కర్ణాటక రాష్ట్ర ప్రభుత్వం ప్రాథమికోన్నత పాఠశాల స్థాయిలో రెండు భాషలలో ఒకటిగా కన్నడ (ప్రాంతీయ భాష) భాషను పరిచయం చేసింది. ఆ స్థాయిలో మార్గదర్శకాలుగా మూడు భాషలు ఉన్నాయి. అవి, మాతృభాష / ప్రాంతీయ భాష, ఒక ఆధునిక భారతీయ భాష, విధిగా ఆంగ్లం.

మూడు భాషలు బోధించడం ప్రాథమిక విద్యావిధానంలో సర్వసాధారణం. ప్రాంతీయభాషా మాతృభాషా ఒకటి కాని విద్యార్థులు తమ మాతృభాషను ఎంచుకుంటే గనక తమ రాష్ట్ర అధికార భాషనే ప్రాంతీయభాష లేక ఆధునిక భారతీయ భాషల విభాగంలో ఏదో ఒక దానిలో విధిగా స్వీకరించాలనే నియమం రాష్ట్రప్రభుత్వమే విధించవచ్చు. కన్నడ మాతృభాషగా కలవారు, కన్నడం మాతృభాష కాకపోయినా కర్ణాటక రాష్ట్రంలో నివసించేవారు అందరూ తప్పనిసరిగా త్రిభాషాసూత్రంలో భాగంగా కన్నడభాషను చదవాలని కర్ణాటక ప్రభుత్వం నియమం పెట్టింది. అందుకు కావలసిన ఉత్తర్వులను జారీ చేసింది. ప్రాథమికోన్నత, సెకండరీ విద్యాస్థాయిలలో అన్నిపాఠశాలలు దీన్ని పాటించాలి. కన్నడిగులను ఆదర్శంగా తీసుకొని తెలుగు భాషాభివృద్ధికి తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ ఉభయ ప్రభుత్వాలూ సత్వరం చేపట్టవలసిన చర్యలు : 1. అన్ని పాఠశాలల్లో ప్రాథమిక స్థాయి నుంచి ఇంటర్మీడియట్ స్థాయి దాకా తెలుగు మాధ్యమం తప్పనిసరి. 2. శాస్త్రీయ, ఆధునిక పద్ధతుల ద్వారా భాషాబోధన. 3. వృత్తి/సాంకేతిక విద్యా కళాశాలలలోనూ, భాషాధ్యయనం, పరిశోధనలకు అవకాశం కల్పించాలి. 4. నియత, అనియత, వయోజన, పాఠశాలేతర విద్యాబోధనలలోనూ, కళారంగాలలోనూ భాషకు ప్రాతినిధ్యం కల్పించాలి. 5. తెలుగు ఒక భాషగా గానీ తెలుగుమాధ్యమంలో గానీ చదవని వారికి తెలుగు సామర్థ్య పరీక్ష తప్పనిసరి చేయాలి. భాషాభివృద్ధి అందరి బాధ్యత. పరోక్షంగా జీవవిధ్వంసానికి కారణమయ్యే భాషా విధానాల పట్ల న్యాయస్థానాలూ చట్టసభలూ పునరాలోచన చేయాలి. జీవవిధ్వంసాన్ని అరికట్టేందుకు మాతృభాషామాధ్యమం తప్పనిసరి చేస్తూ రాజ్యాంగ సవరణ చేయాలి.

**■ గారపాటి ఉమామహేశ్వర రావు,**
**అద్దంకి శ్రీనివాస్**

**సౌజన్యం**

**ఆంధ్రజ్యోతి**

# తెలుగే ఒక

- మూలాలు మరిచిపోకుండా తెలుగుపై మమకారం
- అక్కడే ప్రత్యేక తరగతులతో బోధన
- తెలుగు విశ్వవిద్యాలయ ప్రత్యేక కోర్సులు

ఈనాడు – అమరావతి 

తెలుగు భాష తియ్యదనం.. తెలుగు భాష గొప్పదనం..

తెలుసుకున్నవాళ్లకు తెలుగే ఒక మూలధనం..

అన్న ఓ తెలుగు కవి మాటలను అక్షరాలా నిజం చేస్తున్నారు.. విదేశాల్లోని తెలుగువారి పిల్లలు.. తెలుగు భాషపై వారికున్న ఆసక్తి మూలాల్ని వెతుక్కుంటూ సొంతగడ్డపై మమకారాన్ని కనబరిచేలా చేస్తోంది. మాతృభాషను నేర్చుకోవాలనే వారి ఆకాంక్ష తెలుగు పదాల్ని అలవోకగా పలికేసేలా చేస్తోంది. తెలుగు రాష్ట్రంలో పుట్టి తెలుగు మాట్లాడేందుకు మన పిల్లలు కొందరు నామోషీ పడుతుంటే ఎక్కడో వేల కిలోమీటర్ల దూరంలో పరాయి దేశంలో పుట్టి తెలుగు భాషపై మక్కువను ప్రదర్శిస్తున్న ఈ చిన్నారులు తెలుగు భాషను బతికించాలన్న ధృడ సంకల్పంతో దూసుకుపోతున్నారు. తెలుగులో మాట్లాడటమే కాకుండా చక్కగా రాస్తున్న వీరు మలేషియా దేశస్థులు కావడం గమనార్హం. అక్కడే పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహిస్తున్న కోర్సుల్ని వారు దిగ్విజయంగా పూర్తి చేస్తున్నారు.

విజయనగరం, విశాఖపట్నం, శ్రీకాకుళం, ఇతర జిల్లాలకు చెందినవారు పందేళ్ల క్రితం నుంచే మలేషియాలో ఉపాధి పొందుతూ స్థిరపడ్డారు. తరాలు మారిపోతున్నా వీరి కుటుంబాల్లో కొంతమంది తెలుగు భాషపై ప్రేమాభిమానాల్ని కనబరుస్తూనే ఉన్నారు. తెలుగు కుటుంబాలవారు తెలుగు భాష, సంస్కృతీ సంప్రదాయాల్ని మరచిపోకుండా మలేసియా తెలుగు సంఘాధ్యక్షుడు దతో అచ్చయ్య కుమార్‌రావు ఆయా రాష్ట్రాల్లో ప్రత్యేక కార్యక్రమాల్ని నిర్వహిస్తున్నారు. ఈ క్రమంలోనే 14 నుంచి 19 సంవత్సరాల మధ్య వయసున్న విద్యార్థినీ విద్యార్థులు తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహించిన కోర్సులద్వారా తెలుగు భాషపై మంచి పట్టు సాధించారు. సాధారణ చదువుకు ఆటంకం లేకుండా అదనంగా తెలుగు భాషను నేర్చుకునేందుకు, సంస్కృతి సంప్రదాయాల్ని తెలుసుకునేందుకు ప్రత్యేకంగా సమయాన్ని కేటాయించి మరీ ఆంధ్రుల గొప్పతనాన్ని తెలుసుకుంటున్నారు. చెన్నై నుంచి మలేషియా వెళ్లిన గొట్టా దుర్గా ప్రియా నేతృత్వంలో 17 మంది


'జై తెలుగుతల్లి' అని నిన

సౌజన్యం

ఈనాడు

# మూలధనం!



దిస్తున్న విద్యార్థుల బృందం

విద్యార్థులు ఇటీవల పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయాన్ని సందర్శించారు. కృష్ణా జిల్లా రెడ్‌క్రాస్ సొసైటీ ప్రధాన కార్యదర్శి, విజయవాడ ఎస్కేసీవీ చిల్డ్రన్ ట్రస్టు ఛైర్మన్ డాక్టర్ ఎ.శ్రీధర్‌రెడ్డి ఆహ్వానం మేరకు అమరావతికి వచ్చారు. ఈ సందర్భంగా విద్యార్థులు కైలేశ్వరరావు, మహాలక్ష్మి రంగారావు, దయాశ్రీ రేఖ, మాతానేష్‌రావు, లవిన్‌రావు అప్పారావు, ధనశ్రేఖ కృష్ణారావు, కామిని రంగారావు రెడ్డి, నవినేష్‌రావు, శరణ్యశ్రీ సుబ్రహ్మణ్యం, గొర్ల ఉదయభాను, రామ్‌కుమార్‌రావు, మునేశ్వరరావు, తదితరుల్ని 'ఈనాడు' ప్రతినిధి కలుసుకున్నపుడు 'ప్రపంచ వ్యాప్తంగా తెలుగు భాషకు ప్రత్యేక గుర్తింపు ఉంది. అటువంటి తెలుగులో మాట్లాడుతుంటే చాలా బాగుంది. మేము ఇంట్లో తెలుగే మాట్లాడుకుంటాం. తెలుగు భాష చరిత్రను తెలుసుకోవాలనిపిస్తోంది. అమరావతిని సందర్శించాం. ఎంతో బాగుంది' అని పేర్కొన్నారు.

### మాతృభాషలో మాట్లాడడం గర్వంగా ఉంది

తెలుగులో ప్రవీణ చదువుతున్నాను. ఇంట్లో అమ్మ, నాన్నవల్ల తెలుగు పదాలు మాట్లాడగలను. తల్లిదండ్రుల ప్రోత్సాహం మేరకు సెలవు దినాల్లో తెలుగు తరగతులకు హాజరయ్యాను. తెలుగులోని భాగవత పద్యాలు, రామాయణ పద్యాల్ని నేర్చుకుని వాటి ప్రాధాన్యాన్ని గుర్తించా. **- దివ్యజ్యోతి అప్పారావు**

### నేనే తెలుగు నేర్పుతా

భవిష్యత్తులో సాంకేతిక నిపుణుడు కావాలనుకుంటున్నా. అయితే.. నేను నేర్చుకుంటున్న తెలుగు ప్రాధాన్యాన్ని ఇతర కుటుంబాల వారికి నేర్పించాలనుకుంటున్నా. ఇందుకు తెలుగు భాషపై బాగా పట్టు సాధించాలి. సాధిస్తాను. **- రామ్‌ధనరాజ్ పాలమురశెట్టి**

### ఆహారపు అలవాట్లు బాగున్నాయి

ఇక్కడి ఆహారపు అలవాట్లు బాగున్నాయి. నాకు ఇక్కడే ఉండాలనిపిస్తోంది. **- గణేశ్‌బాబు**

### 2013 నుంచి..

మా బృందంలోని విద్యార్థినీ విద్యార్థులు 2013 నుంచి తెలుగు నేర్చుకుంటున్నారు. 134 మంది విద్యార్థులు తెలుగు నేర్చుకునేందుకు ముందుకురాగా వీరిలోని కొందరే ఇప్పుడు ఇక్కడకొచ్చారు. మలై, తమిళంలోనే మాట్లాతూ తెలుగును నేర్చుకుంటున్నారు.

**- దుర్గాప్రియా, ఉపాధ్యాయురాలు**

### విద్యార్థుల ప్రతిభ అభినందనీయం

ప్రవేశిక, మాధ్యమిక, ప్రవీణ, విశారద కోర్సుల్ని మలేషియాలో నిర్వహిస్తున్నాం. ఏడెనిమిది మంది విద్యార్థులు తెలుగు భాషపై పట్టుసాధించారు. వారి ప్రతిభ అభినందనీయం. **- ప్రొఫెసర్ మునిరత్నం నాయుడు**



"I have travelled across the length and breadth of India and I have not seen one person who is a beggar, who is a thief such wealth I have seen in this country, such high moral values, people of such caliber, that I do not think we would ever conquer this country, unless we break the very backbone of this nation, which is her spiritual and cultural heritage and therefore, I propose that we replace her old and **ancient education system**, her culture, for if the Indians think that all that is foreign and English is good and greater than their own, they will lose their selfesteem, their native culture and they will become what we want them, a truly dominated nation".

2-2-1835

// *Lord Macaulay's Address to the British Parliament on* ***2nd Feb 1835***